# కాంతం వృద్ధాప్యం

మునిమాణిక్యం
నరసింహారావు



దేశికవితామండలి
విజయవాడ - 2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
నవంబరు—1955
హక్కులు కర్తవి
వెల : రూపాయి

దేశీ ప్రెస్
విజయవాడ-2.




సంపాదకులు :

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

# అంకితం: అన్నయ్యకు

మనసిచ్చి నాతోడ మాట్లాడుతాడు
చనువిచ్చి నాకెంతొ సాయపడ్డాడు
మా అన్న నిజముగా మా మంచివాడు
నిర్మలంబైనట్టి నీరంబుతోను
నిండియుండేటట్టి నీరాకరంబు
పెక్కు కల్వలతోడ వికసించినట్లు.

వెన్నెలకోగాని వెన్నకోగాని
కలుగంగబోనట్టి కాంతులతోను
భావాల కందని పరువమ్ముతోను
మోహమ్ము గొలిపేటి మొలక నవ్వులను
మా యన్న మోమెంతో మధురమైతోచు

కాటూరు వారన్న కవులలో ఘనులు
కవితలో వెలలేని కలిమి నంతటిని
మీసాల కొసలలో మెలిపెట్టినారు.

అట్టివాడైన మా యన్నయ్య యపుడు
చెల్మితో నన్నెంతో చెంతకుదీసి
చిరునవ్వులొలికేటి చిన్నిసోదరుడ
పండిత ప్రస్తుతుల్ పడసినా వాడ
మరదలు పిల్లకు మగడైన వాడ
కదిలరా వేగంబు కాంతమ్మ మొగుడ

వయ్యారముల నొల్కు వచనంబులోన
తియ్యనౌ రచనలు తీరుగా జేసి
హాస్యరసంబీవు అలరించినావు

మరదలు నిజముగ మహిమంబు కలది
తెలుగువారికి ఆమె తీయ చుట్టంబు
ఆంధ్రుల కామెయే ఆదర్శ మహిళ

దివినుండి భువిపైకి దిగినట్టి యామె
అందరికిని తల్లి అయినట్టి యామె
కాంతమ్మ కాపురం కథల నన్నింటి
కమ్మగా అల్లావు ఘనత కెక్కావు

కథకుల నీ కంటె గండడు లేడు
కలకాల ముండేటి కథలు చెప్పావు
కవ్వించి మమ్ముల నవ్వించినావు
కనగాను నీకంటె ఘనుడెవ్వరయ్యా
నిక్కమూ నీరీతి పెక్కుమాటలను

మేటివి నీవని మెచ్చుకొన్నాడు
తమ్ముడా నీవెంతో ధన్యుండవోయి
అనుచు నాతోడ వారాదరం బొదవ
పల్కగా నాకెంతొ ప్రాభవంబయ్యె

అన్నకీ పుస్తకం అంకితం ఇచ్చి
మన్ననల్ పొందంగ మనసాయె నాకు

గండపెండేరంబు కాంక్షింపలేదు
మడి మాన్య మిమ్మని అడుగంగ లేదు
ధనధాన్య మిమ్మని దరిజేరలేదు
కోకలిమ్మని నిన్ను కోరడం లేదు.

అన్నగారీ కోర్క నంగీకరించి
మనసార దీవించి కనికరం జూపి
చిరునవ్వు పువ్వులు శిరమునజల్లి
సత్కరిస్తే చాలు సంతపిస్తాను.

# శాంతం వృద్ధాప్యం

అది ఒక చిన్న గ్రామం.

ఊరి మొగన దేవాలయమూ, దాని ముందొక మండపమూ ఉన్నవి. ప్రతిరోజూ సాయం సమయానికి ఊరి పెద్దలంతా ఆ మండపంమీదికి చేరతారు. అక్కడ పురాణ కాలక్షేపాలూ అవీ జరుగుతూ ఉంటవి. ఆత్మకూ పరమాత్మకూ గల సంబంధాన్ని గురించి, జీవితంయొక్క అశాశ్వతత్వాన్ని గురించి అక్కడ తరుచుగా చర్చిస్తూ ఉంటారు.

అది శివాలయం. గుళ్ళోకి వెడితే భక్తులు ఎవరూ కనబడరు. ఈ విషయం మనకు ఆశ్చర్యాన్ని కలిగించ నక్కరలేదు. ఈ రోజులలో దేముడు ఎవరికి కావాలె!

ఒక తలనెరసిన ముసలి ముత్తయిదువ మాత్రం రోజూ [illegible] [illegible] వస్తూవుంటుంది. గోచీపోసి గులాబిరంగు చీర కట్టింది. జరీపేటుగల నీలిరంగు రవిక తొడుక్కున్నది. పొట్టిగా లావుగా ఉన్నది. కొప్పుపెట్టుకొని కొప్పులో చేమంతి పూలు తురిమినది. అటువంటి పూర్వకాలపు మనుష్యులు మనకు తరుచుగా కనపడరు ఈ రోజులలో.

ఆమె చిన్నతనంలో రత్నశలాకలాగ ఉండేది. ఇప్పుడు కాస్త [illegible] లావు అయింది. కాలుతీసి కాలు పెట్టలేనట్లు నడుస్తు న్నది. [illegible] ఆ నడక ఎంతో అందంగావుంది. ఎంత [illegible]! ఎంత గాంభీ[illegible]

ర్యం! పుణ్యస్త్రీలు, దేవతాస్త్రీలు నడిచేనడక అది! ఆ నడ కనుచూచి తారలు తళతళ లాడుతవి! ఆ నడకనుచూచి అమరనది పులినతలాల్లో విహరించే రాజహంసలు సిగ్గుపడి పద్మసరస్తాల్లో తలదాచుకుంటాయి. ఆ నడకనుచూచి మారుతము భక్తివినయాలతో మందగమనమును పొందుతుంది ఆమె సమక్షంలో. దేవాలయంలోని దీపాలు తలలువంచి ఆమెకు నమస్కరిస్తవి.

ఆమె పుణ్యమూర్తి. ఆమె వంగి స్వామికి నమస్కరిస్తూవుంటే పార్వతీ దేవియే భూమిమీద తిరుగుతున్నదా అనిపిస్తుంది.

ఆమె గంట ప్రమోగించింది. ఆమె పవిత్ర చరిత్రను లోకానికి చాటుతున్నది ఆ గంట!

ఆమె పిల్లలతల్లి. ఆదర్శగృహిణి. ఆమెకు నమస్కారం చెయ్యదగును. పాదాభివందనం చెయ్యదగును. ఆమె ఆశీస్సు పొందటము కోరతగిన విషయం. ఆమెయే కాంతం.

* * *

కాంతానికి ఇప్పుడు ఏభై యేండ్లు. ముసలిముత్తయిదువ. ఆమె చూపులలో తళుకులు మందగించినవి. కాని ఆమె కర్ణభూషాదులనుండి వెలువడే కాంతులు చెక్కిళ్ళపై నాట్యం చెయ్యడము మాన లేదు. ఆమెపాదాల పసిమికాంతులు గచ్చునేలపై ప్రసరించి తళుకులీనడమూ మాన లేదు.

ఆమె ఇప్పుడు గృహానికి అధిదేవత. ముప్పదిఏండ్లు కాపరంచేసిన ఆమె గృహిణీత్వము, ఆ నడకలలోనూ, మాటల లోనూ ప్రస్ఫుటమవుతున్నది. ఆమెమాటలతో తృప్తీ, అధి కారమూ, ప్రేమా, చనువూ, ఆదరణా అన్నీ వున్నవి.

కాంతానిది నిండు సంసారం. ఆమెకు ముగ్గురు ఆడ పిల్లలు. అందులో పెద్దది రుక్కుతల్లి, దేముడుదగ్గరకు వెళ్ళింది. రెండోపిల్ల సుశీకి ఒక కుమారుడు. మూడోపిల్లకు తొలి కాన్పుకు ఆడపిల్ల—మళ్ళీ ఇప్పుడు పండంటి మొగపిల్లవాడు కలి గాడు. మొగపిల్లలు ఇద్దరు. అందులో పెద్దవాడికి పెళ్ళిఅయి భార్య కాపరానికి వచ్చింది. ఒక ఆడపిల్లకూడాను. ఆ రెండో వాడికి ఇంకా పెళ్ళికాలేదు. సంబంధాలు వస్తున్నవి కాని ఒకటుంటే ఒకటుండక ఆవిడకు ఒకటీ నచ్చడము లేదు. రూపమూ, గుణమూ, సాంప్రదాయమూ అన్నీ ఉన్న సంబంధంచూచి జైమంటూ కొడుకుపెళ్ళి ఎక్కువ వైభవంగా చేద్దామని ఆమె అనుకొంటున్నది. ఆ పెళ్ళికాస్తా అయిపోతే ఇప్పట్లో ఆమె చెయ్యవలసిన శుభకార్యాలు ఏమీ ఉండవు. కాకపోతే ఇక మనుమరాళ్ళపెళ్లి. అది ఎప్పటి మాటో!

కాంతం గుడిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచేసి, లోప లికి వెళ్లి, గంటమ్రోగించి, పరమేశ్వరుని కెదురుగా నిలబడి నమస్కరించి, ప్రార్థనచేసింది. చంకనున్న మనుమరాలును కూడా దింపి "దేముడికి నమస్కారంపెట్టు అమ్మా"అని ఆ పసి దానిచేతకూడా నమస్కారం పెట్టించింది.

ఆ తరువాత తృప్తినిపొందిన హృదయంతో పిల్లవాణ్ని ఎత్తుకొని ఇంటివైపు నడిచింది.

౨

"కోడలు కాపరానికి వచ్చిన తరువాత ఈ యింటి వ్యవహారం అంతా దానికి ఒప్పజెప్పి నేను కృష్ణారామా అంటూ కూర్చుంటాను. ఎందుకొచ్చిన బెడద నాకిది" అంటూ ఉండేది కాంతం. కోడలు కాపరానికి వచ్చిన తరువాత కూడా కాంతానికి గృహనిర్వాహణ భారము కించిత్తయినా తప్ప లేదు.

ముందు సంగతి కాంతం ఇంటి చాకిరీతో సతమతం అవుతున్నది. నిజానికి ఏమాటకు ఆమాటే చెప్పాలె; కాంతం పెద్దది అయిందికదా, "నీవు కూర్చో అత్తయ్యా నేను చూసుకొంటానులే ఈ వ్యవహారం అంతా" అని అనకూడదూ ఆ కోడలు! ఊహూ ఆ పిల్ల అటువంటి కోడలుకాదు.

కాంతం తెల్లవారుఝామున లేస్తుంది. కాలకృత్యాలు తీర్చుకోవటం స్నానం చెయ్యటం మొదలైన పనులన్నీ తెల్ల వారేటప్పటికి పూర్తి అవుతాయి. ఇక అప్పటినుంచి రాత్రి పదింటికో పదకొండింటికో పడుకోబోయేదాకా ఆమెకు క్షణం తీరిక ఉండదు.

ముసలాయనను చంటిబిడ్డలాగ చూచుకొంటుంది కాంతం. ఆయన కోసమని వేడినీళ్లు పొయిమీద పెట్టి తాను చన్నీళ్లు స్నానం చేస్తుంది.

ఆ కోడలుంది గదా, పెందలాడే లేచి అత్తకు కాస్త సాయం రాకూడదూ! ఆ అమ్మాయి లేవటమే ఆలస్యం, ఇంక అత్తకేమి సాయంచేస్తుంది!

కాంతం అయినా, "అదేమిటే సుందరీ. పెందలాడే లే" అనకూడదూ. ఆమెగారూ అనదు. ఎవరన్నా 'కోడలింకా నిద్రలేవలేదమ్మా!' అని ముక్కుమీద వేలేసుకుని అడుగుతారా, అడిగితే కాంతం అంటుంది; 'అదే లేస్తుందిలే వదినా, చిన్నపిల్ల! రాత్రంతా దానికి నిద్రవుందా ఏమన్నానా!' అని ముసిముసినవ్వులు నవ్వుతుంది. అంతేగాని కోడలుమీద మాట పడనివ్వదు.

ఆ పిల్లకైనా తెలియనద్దూ, పోనీ అత్తకు సాయమూ వద్దు, చట్టుబండలూవద్దు, కాఫీ కాచుకుని తనూ మొగుడూ తాగి కాస్త ముసలాయనకిస్తే ఆమెగారికి ఒకపని అయినా తప్పుతుందని! ఆ కోడలు ప్రొద్దున్నే లేవదు. లేచినా గబగబా నాలుగుపనులూ చేసుకుపోయే నేర్పుకలదన్నా కాదు. అత్త మెత్తనిది కాబట్టే ఆపిల్ల ఆటలు సాగుతున్నాయి. పసిదానితో ఆపిల్ల సతమతం అవుతున్నమాట నిజమే! అయితే తాను మటుకు తూగుటుయ్యాలలో ఊగుతున్నదా ఏం? 'ప్రొద్దస్తమానమూ దాంతో కూర్చుంటే ఎల్లాగే పిల్లా! దాన్ని ఉయ్యాలలోపడేసి నీవు ఇటురా' అని గట్టిగా అనకూడదూ కాంతం. అబ్బే అట్లాఅనదు. పైగా ఆ పసిదికాస్త 'కీ' అన్నదా ఈవిడ గిలగిల్లాడిపోయి "దాని సంగతిచూడవే. ఇక్కడ నీవు

చెయ్యాల్సినపని ఏమీలేదులే! వెళ్ళు. దాన్ని ఏడిపించబోకు" అని పంపించి వేస్తుంది.

అనవే అన్న పిగదా అని ఆ కోడలు పిల్లదాన్ని చంకను వేసుకుపోయి గదిలో కూర్చుంటుంది. కూర్చుని దానితో మాట్లాడుతూ దాని ముద్దుమాటలువింటూ ఉంటుంది. "పిల్ల ఏడుస్తుంటే ఎత్తుకొని కూర్చున్నాను అత్తయ్యా!" అని అంటుంది ఎప్పుడైనా అత్తగారు పిలిచి 'ఏం జేస్తున్నావే అమ్మాయీ?' అంటే.

ఈ పిచ్చిముత్తుకోళ్ళు ఆ కోడలు మాటలు నమ్ముతుంది. ఆ మాట నిజమేఅయితే ఆ ముసిముసినవ్వులెందుకూ! ఈ మాటవిని గదిలో పడకకుర్చీలో కూర్చున్న తనకొడుకు ఎందుకు నవ్వుతున్నాడో తెలిసికొనే నేర్పు ఉండక్కరలేదూ ఈవిడకు మాత్రం! ఆ నేర్పు లేకపోబట్టే ఆ కోడలు అత్తగారిని చెవులుపట్టుకొని ఆడిస్తున్నది.

కాంతం మడి కట్టుకోబోతూ వున్న సమయానికి 'అత్తయ్యా జడవేయవూ' అంటూ వచ్చింది వీరయ్యగారిపిల్ల. దానికి తలదువ్వి జడవేసి పూలుపెట్టి చెంపలుదువ్వి "పోవే భడవా కొంచెం ముందుగా రాకూడదటే. సరిగ్గా నేను మడి కట్టుకొనే సమయానికే రాకపోతే" అని కోప్పడినట్లు కోప్పడి పంపించింది.

ఇంతలో కోడలు పిల్లదాన్ని ఎత్తుకొచ్చి "నీళ్ళుపోద్దాం రండి అత్తయ్యా వేడినీళ్ళుతోడి ఉంచాను" అన్నది.

"ఎన్నాళ్ళకూ పిల్లకు నీళ్ళుపోయటం తెలియకపోతే ఎట్లాగే! నేను ఎప్పుడూ ఉంటానా! నీ బిడ్డకు నీవు నీళ్ళు పోసుకోటం తెలుసుకోవద్దూ! ఎన్నాళ్ళయినా ఇంతేనా?" అంటూ శేషుని తీసుకొని ముద్దాడి నీళ్ళగదిలోకి తీసుకెళ్ళి కాళ్ళమీద పడుకోబెట్టుకొని నలుగుపిండి పట్టించి నలిచి శుభ్రంగా స్నానంచేయించి దానిచుట్టూ నీళ్ళుతిప్పి నూరేళ్ళ ఆయుష్షు కొడుకుల తల్లివై కూతుళ్ళ తల్లివై అంటూ దీవించి తల్లి చేతికిస్తూ "ఇల్లా అయితే వీల్లేదిక్లా—నీ కూతురుపని నీవే చేసుకోవాలె అమ్మాయి రేపటినుంచి, తెలిసిందా!" అని చెప్పేదది కాంతం. రోజూ ఇల్లాగ చెప్పుతూనే ఉంటుంది. అత్తగారు చెప్పేదికదా ఆమెకు కష్టం కలిగించటం ఎందుకు అని తనే పోసుకొంటే కాంతం మనస్సు చివుక్కుమనిపించుకొని "ఇదేమిటే కోడలా, ఇల్లాగేనా బిడ్డకు నీళ్ళు పోయటం? చక్కగా నలుగుబెట్టి నీళ్ళుపోసుకోవటే! ఒంటినిండా జిడ్డు అల్లాగే ఉండిపోయింది. ఇదేమి నీళ్ళుపోయటమే! ఇంత ఒళ్ళు బరువైతే ఎల్లాగమ్మా! నీకు చేతకాకపోతే ఊరుకో. నా మనుమరాలుకు నేను నీళ్ళు పోసుకోలేనను కొన్నావా!" అని విసుక్కుంటుంది.

తరువాత సుందరి కాఫీచేసి అందరికీ ఇచ్చింది "మీరు కూడా కాస్త తాగండి అత్తయ్యా" అన్నది.

"నాకేమీ అక్కరలేదు. కాఫీ తాగాలిసిందే ఇన్నేళ్ళూ వచ్చి. మీ మామగారికి ఇయ్యి ఇంకొకసారి నా వంతుకూడా

ఆయనే తాగుతారులే" అని ముసలాయనతో సరసమాడి స్నానం చెయ్యటానికి వెళ్ళింది కాంతం.

"కాఫీ ఇవ్వాళ చాలా బాగుంది" అన్నాడు ముసలాయన. ఇంకా కొంచెం పుచ్చుకోండి అని కోడలు బలవంతం చేస్తే ముసలాయన సరే అన్నాడు. ఆయన మనుమరాలును ఎత్తుకొని ముద్దాడుతూ ఆ కాస్త కాఫీకూడా తాగేశాడు.

ఇంతలో జానకమ్మ దొడ్డిగుమ్మం దగ్గరకొచ్చి "రెండు కరివేప రెబ్బలుంటే ఇయ్యి అత్తయ్యా" అని అడిగి దొడ్డి గడపమీదే నుంచుని తనకొడుక్కి జబ్బుగావున్న సంగతి చెప్పి "మధ్యాహ్నంవచ్చి కాస్త చూచిపోతావ్వగా అత్తయ్యా!" అన్నది.

"అయ్యో ఎందుకురానమ్మా తప్పకుండా వస్తాను తల్లీ. ఇవి పైత్యపుజ్వరాలు లే. మరేమీ భయంలేదు" అని చెప్పి ఆ అమ్మాయిని పంపివేసింది.

అప్పటికే తొమ్మిదిగంటలు కావస్తున్నది. వంటకాలే దని కాంతానికి ఆదుర్దా ఎక్కువ అయింది "సుందరీ! కూరలు తరగటం అయిపోయిందా!" అని కేకవేసింది కాంతం.

"అయిపోవచ్చిందత్తయ్యా" అన్నది సుందరి.

కాంతం ముఖం చిట్లించి "ఇంకా అయిపోవచ్చిందంటా వేమే! అప్పుడనగా కూర్చుంటివి! ఇంత ఆలస్యం అయితే ఎల్లాగ చెప్పూ."

ఆయన పిలిస్తే వెళ్లాను అత్తయ్యా. ఏవో గుండీలు కన పడలేదుట. అవి వెతికి యిచ్చేసరికి కాస్త ఆలస్యం అయింది" అన్నది కోడలు.

కాంతానికి ఎక్కడలేని విసుగూవచ్చి "ఏమోనమ్మా నాకు తెలియదు. ఇక్కడేమో పొయి మండిపోతూఉంటే! నేను స్నానంచేసి వచ్చేసరికి నువ్వు కూరలుతరిగి సిద్ధంగా ఉంచుతావుగదా అని అనుకొంటే నీవేమో ఇల్లాగ తయారైతివి! నేను ఈ సంసారం చెయ్యలేనమ్మా. ఎన్నాళ్ళని ఈ తాపత్రయాలు! కాకపోయినా ఈ సంసారంలో ఇలా కూరుకుపోతూ ఉంటే ఇక కాస్త కృష్ణా రామా అనుకోవటం ఎప్పుడు!"

"ఏంజెయ్యను అత్తయ్యా! ఆయనకు గుండీలు వెదికి ఇచ్చేసరికి ఈ పిల్లముండ ఏడ్పుసాగించింది. దాన్ని పెట్టుకు కాసేపు పడుకోవలసి వచ్చిందాయె! ఏం జేయను అత్తయ్యా!"

"ఏంజెయ్యాలో నాకు తెలీదమ్మా. కాకపోయినా నీ సంగతి ఏమీ బాగుండలేదు. ఇంట్లో పెద్దది ఉన్నదికదా, అన్నీ చూచుకు పోతుందిలే అనేగా నీ ధీమా?

"ఏ ధీమా అత్తయ్యా" అన్నది సుందరి గర్వంగాచూస్తూ.

"ఈ ధీమా ఎన్నాళ్ళో అదీచూస్తానుగా. ఈ సంసారం విషయమై ఇక నేను పట్టించుకోను. కాకపోయినా ఈ బెడద ఎవరు పెట్టుకుంటారు?"

సుందరి కొద్దిగానవ్వి "మీరు పెట్టుకోకపోతే ఎవరు పెట్టుకుంటారు అత్తయ్యా?" అన్నది.

"సుఖ్యం. ఇక అన్నీ నీవే చూచుకోవాలె. ఎవరికోసం చూసుకొంటావేవ్" అన్నది కాంతం దబాయింపుగా.

"నాకేం తెలుస్తుంది అత్తయ్యా!" జాలిగా అన్నది కోడలు ఈ మాటలు.

"సంసారం మీదపడితేసరి అన్నీ తెలుస్తాయి. తెలియక కూర్చుంటారయ్యా!" అన్నది కాంతం ఈసడింపుగా.

"నాకు తెలియదు అత్తయ్యా"

"తెలియదూ! ఎందుకు తెలియదే! తెలియకపోతే ఊరుకో. ఎన్నాళ్ళని ఈదమంటావ్ ఈ సంసారాన్ని! నావల్ల కాదమ్మా. అందరు కోడళ్ళూ ఎవరి సంసారం వారు నెత్తినేసు కొని ఒకాకొంటున్నారా, నీ మోస్తరు కూర్చుంటున్నారా?"

"స్వర్గదిక్కులేని వాళ్ళకర్మం ఏమో నేను చెప్పలేను గాని ఈ సంసారభారం అంతా నెత్తినేసుకునే అవసరం నా కేమీ లేదు. నాకేం! నిక్షేపంలాగ చూచుకుపొయ్యే అత్త గారుంది! అందరికీ ఆ అదృష్టం ఉండొద్దూ!" అని పొంగు తున్న సంతోషాన్ని అణచుకొంటూ అన్నది సుందరి.

"నీవు అదృష్టవంతురాలవే. అదెట్లాగూ నిజమే. కాని నేను కాశీకి వెళ్ళిపోయిన తరువాత నీవు అన్ని విషయాలూ చూచుకోక ఏంజేస్తావో కాస్త చెప్పవే కోడలా!"

"ఏం జేస్తానా! అసలు నేను మిమ్ములను వెళ్ళనియ్యాను. శేషునువదలి మీరు క్షణం ఉండగలరూ, ఆ సంగతి ముందు మీరు చెప్పండి?"

"ఆఁ - ఉండాలంటే ఉండనూగలను. ఉండక తప్పు తుందా. ఆ పార్వతమ్మగారు బయలుదేరుతుందట ఇంకా అయిదారు రోజుల్లో. నేనూ ఆమెతో బయలుదేరుతాను."

"మీరెట్లా వెళ్ళుతారండీ! మీరు వెళ్ళటానికి వీలు పడదు."

"మహాచక్కగా వీలుపడుతుంది. వీలుబడక ఏంజేస్తుంది!"

ఈ విధంగా తాను కాశీకి వెళ్ళిపోవటానికి నిశ్చయించు కొన్నట్లు కాంతం ఆ రోజు గట్టిగా చెప్పేసింది. 'ఎట్లాగురా భగవంతుడా, ఆమె పెద్దది ఉండి అన్నీ చూచుకుపోతున్నది కాబట్టి సరిపోతున్నది. ఆమె కాశీకి వెళ్ళితే నాకేం తెలుస్తుంది ఈ సంసారం గొడవ' అని సుందరి ఎంతో భయపడ్డది కూడానూ.

ఆ తరువాత పదిరోజులకు పార్వతమ్మగారు కాశీకి వెళ్లిపోయింది. కాంతం ఆమెతో వెళ్ళటానికి ఏ విధమైన ప్రయాణమూ చేయలేదు. ఆ సంగతే ఎత్తలేదు.

సుందరికి కాస్త ధైర్యంవచ్చింది, అత్తగారు అన్నట్లు కాశీకి వెళ్ళకపోయేసరికి. రోజులు గడిచిపోతున్నవి. ఒకరోజున మళ్ళీ విసుక్కున్నది కాంతం కోడలుపైన 'నేను ఈ సంసారం చెయ్యలేను వెళ్ళిపోతానూ' అంటూ!

సుందరి లోలోపల నవ్వుకుంటూ పైకి విసుక్కున్నట్లు నటిస్తూ అన్నదీ, "వెళ్ళండి అత్తయ్యా, ఎవరు వద్దన్నారూ! వెళ్లకపోయినారా పార్వతమ్మగారితో?"

కోడలు విసుక్కుంటే ఊసుకుసేందుకు కాంతం ఏమీ తెలివితక్కువదికాదు. మాటకుమాట అంటించే నేర్పు లేక పోలేదు కాంతానికి! కాని ఎందుచేతనో కాసేపు మాట్లాడక ఊరుకొని చివరకు "అవును లేవే కోడలా నీకు అలుసు అయి నాను. వెళ్లుతానమ్మా, తప్పకుండా వెళ్ళుతాను. అసలు మొన్ననే వెళ్ళిపోయేదాన్ని. ఆ పుట్టే మనుమడు ఎట్లా ఉంటాడో చూద్దామని ఉండిపోయినాను" అని ముసిముసి నవ్వులు నవ్వుకొన్నది.

ఆ పుట్టబోయే మనుమడి కోసం కాశీ విశ్వేశ్వరుని దర్శనంవల్ల వచ్చేపుణ్యాన్ని కాంతం త్యాగంచేసిందో, లేకపోతే ఆ విశ్వేశ్వరుడే తనను వెతుక్కుంటూ వచ్చి దర్శనం ఇస్తాడను కొన్నదో, సుందరి గ్రహించలేక తానుకూడా నవ్వుకొని ఊరు కొన్నది.

కాని ఆ తరువాత సుందరి అత్తగారి పూజా మంది రానికి ఎదురుగా నిలబడి ఆ పరమేశ్వరుని నిమీలితనేత్రా లతో ధ్యానంచేసింది.

౩

కాంతం కొడుకులతోనూ కోడలుతోనూ సుఖంగా కాలం వెళ్లబుచ్చుకొంటే బాగుండును. అందరి సంగతులూ ఆమెకే కావాలె. అందరికీ ఆమె కావాలె.

ఆ సీత కాపరం ఏమిగా బాగుండలేదని కాంతం ఎన్ని సార్లు అనుకొన్నదో చెప్పలేను. దానిదీ పెద్దసంసారంఅయింది. తన కళ్ళముందు కాపరానికి వచ్చింది సీత. ఆ అమ్మాయికి మూడుపురుళ్ళు పోసింది. ముగ్గురూ మొగపిల్లలే. వాళ్ళను చూస్తే కాంతానికి అమితమైన ఆనందం. వాళ్ళను తన చేతు లతో పెంచి పెద్దవాళ్లను చేసింది. వాళ్లు "అత్తయ్యా అత్తయ్యా" అంటూ ఈ మొగారి కొంగుపట్టుకొని తిరుగుతూ ఉంటారు.

సీత ఆ ఇంట్లో చాకిరీచెయ్యలేక చిక్కి సగం అయిపోయిం దనికాంతం ఊహ ఇదౌతూ ఉంటుంది ఎప్పుడూను. ఇంట్లో వెధవ ఆడబిడ్డఉంది సీతకు. కాని ఏంలాభం ఆవిడగారు ఇవతల చెంబు అవతలపెట్టదు. స్నానాలు, పూజలు, పురాణ శ్రవ ణాలతో సరిపోతుంది ఆవిడకు. ఆ పిల్లే అన్నిపనులూచేయాలె. అత్తగారు కూతురు పక్షంజేరి సీతతో యుద్ధానికి ఎప్పుడూ సిద్ధము.

ఆ అత్తగారు వంటయింట్లో సామనంతా పరుచుకు కూర్చుని కోడలుపైన ఫిరంగులు పేలుస్తూ ఉంటుంది "నీకూ, నీ కొడుకులకూ చేయలేక చస్తున్నాను. ఈ ప్రాణానికి సుఖం అంటూలేదు. అందుకోడళ్లూ అంచక్కా అత్తను కూర్చో బెట్టి సంసారం దిద్దుకుపోతారు. నా మానానికి ఆ సౌఖ్యంఏదీ?"

"నీకు ఒళ్లు ఆయిత్తు కావటం లేదా ఏమిటే సీతా! తింగురంగా అని పిల్లవాణ్ణి పెట్టుకొని కూర్చుంటే ఈ మంద

కంతా సంది అమర్చటానికి నేను నంటబాన్ని అనుకొన్నావా?"
ఈ ఎరసను అయినదానికీ కానిదానికీ నోరుజేసుకొని తిట్టడమే ఆమెపని.

"పప్పులో ఉప్పెక్కువ అయిందేమి అమ్మా?" అని కొడుకులంటే "కాక ఏంజేస్తుందిరా! నీ పెళ్ళామేమో పచ్చి భోగందానిలాగ అలంకరించుకొని గదిలో కూర్చుంటే ఉప్పు ఎక్కువగాక ఏంజేస్తుంది! దాన్ని కాస్త అదుపులో పెట్టలేని దద్దమ్మవు. అందుకనే నీవు కమ్మగా తింటానికికూడా ప్రాప్తం లేకుండా పోయింది" అంది ఆవిడ.

కోడలు అలంకరించుకొని కూర్చుంటే కూరల్లో ఉప్పు ఎక్కువ ఎందుకు పడుతుందో, ఈ రెండింటికీగల సంబంధం ఏమిటో అర్థంచేసుకునే శక్తి ఉంటేగా ఆ కుర్రవాడికి! అందుకనే ఆ అబ్బాయి ఈ మాటలువిని పెళ్లాంవంక కొఱకొఱా జూచి తినగలిగినంత తిని లేచిపోతాడు. కాంతం అప్పుడప్పుడు వెళ్ళి సీతనుచూచి, ధైర్యంచెప్పి వస్తూ ఉంటుంది.

ఆ మధ్యాహ్నం కాంతం కాస్త నడుమువాల్చి సేద తీర్చుకొంటూ ఉండగానే 'అత్తయ్యా' అంటూ వచ్చింది మణెమ్మ. కాంతం లేవటానికి బద్ధకించక "ఏంటే పిల్లా ఏదో పనిమీద వచ్చినట్లున్నావ్! ఏంకావాలె మణీ" అని ప్రేమగా అడిగింది. ఆ పిల్ల మొగుడు రెండు చీరలు తెచ్చి యింట్లోపడేసి, ఈ రెండింటిలోనూ ఏదిబాగుంటే అది తీసుకో అన్నాడట. ఏ చీర బాగుంటుందో ఆ పిల్లకేమి తెలుసు! ఆ పిల్లకే

కాదు ఆ పేటలో ఎవ్వరికీ తెలియదు. ఎవరికి ఏ చీర బాగుంటుందో ఎవరికి ఏ రవిక బాగుంటుందో మా అత్తయ్య గారు చెప్పాలిసిందే. ఆమెకు తెలియకుండా ఎవ్వరూ ఏదీ కొనరు. "ఈ మామిడిపండు రంగు చీర కొనుక్కో అమ్మా. దానిపైకి ఆ గులాబీ రంగు రవిక తొడుక్కుంటే ఎంతో బాగుంటుందమ్మా. ఇదే తీసుకో" అని చెప్పి ఆ పిల్లను పంపించింది కాంతం.

ఇంతలోకే దొడ్డితలుపు టకటకా అని ఎవరో కొట్టారు. "ఎవరూ!" అని పెద్దగా పలికింది కాంతం.

"నేనే అత్తయ్యా"

"భడవా, ఎందుకే ఈ వేళప్పుడు వచ్చావు. ఏం మునిగి పోయిందమ్మా!" అన్నది కాంతం.

"అదిగాదు అత్తయ్యా. అమ్మ నిన్ను తొందరగా రమ్మన్నది. తమ్ముడికి జ్వరం వస్తున్నది అత్తయ్యా" అని ఆపిల్ల రొప్పుకుంటూ చెప్పగానే కాంతం దిగ్గున లేచి "ఇందాక చెప్పింది మీ అమ్మ. నేనే మరిచిపోయినాను. దిక్కుమాలిన మరుపు వచ్చిందమ్మా కాకపోయినా. వస్తున్నానమ్మా. నీవు ముందు పరిగెత్తికెళ్ళి అత్తయ్య వస్తున్నదని చెప్పు" అని ఆ పిల్లదాన్ని పంపించి, "సుందరీ" అని కోడలును కేకేసి "చూడవే కోడలా, నేను కాస్త జానకమ్మగారి ఇంటికి వెళ్ళివస్తానమ్మా, నీవు కుంపటి రాజేసి కాస్త కాఫీకాచి మీ మామ గారికి ఇస్తావు కదూ?...ఆయన నిద్ర లేచేసరికి కాఫీ సిద్ధంగా ఉండాలి సుమా" అని ముక్తాయింపు ఏలోటూ లేకుండా మహారాజులాగ జరిగే ఏర్పాటు చేసి మరీ వెళ్ళింది.

వెళ్ళేది యశోదాయకేని వెళ్లిపోక గడపదాటి రెండు అడుగులువేసి వెనక్కుతిరిగివచ్చి మనుమరాలును ఎత్తుకొని "ఉండమ్మా బంగారు తల్లి వికదూ, ఏడవబోకూ; నేను వచ్చిందాకా అమ్మను ఏడిపించబోకు; అమ్మవుకదూ; ఉంటావా ?" అని అడిగి, ఏడ్వకుండా బుద్ధిమంతురాలులాగ ఉంటానని ఆ పసిదానిదగ్గర వాగ్దానం తీసుకొని మరీ వెళ్ళింది.

జానకమ్మ కొడుకుని ఎత్తుకొని వరండాలో అటూయిటూ తిరుగుతున్నది. ఆ శాయి ఒక్కతీరాన ఏడ్వటం సాగించాడు. ఎంత బ్రతిమిలాడినా ఊరుకోటంలేదు. జానకమ్మ దిగులుపడి వాడిని బుజానవేసుకొని తిరుగుతూ సతమతం అవుతున్నది.

"మందైనా తాగడాయె ఈ చిన్ని వెధవ. ఎట్లాగండి వీడితో. జ్వరం ఎల్లాగ నయమౌతుందో !" అని జానకి మొగుడితో చెప్తూ హడలిపోతున్నది.

"నాకుమటుకు ఏం తెలుసే, ఏంజెయ్యాలో. మా కాంతమ్మ పిన్నిగారికి కబురుచెయ్యి." అన్నాడు ఆ అబ్బాయి. "కబురు చేశానండీ–వస్తుంది" అన్నది ఆ పిల్ల.

పిల్లవాడు ఒక్కతీరాన గుక్కపట్టి ఏడుస్తుంటే, జానకమ్మ వాడిని బుజాన వేసుకొని వీధిగుమ్మంలోకి వచ్చేసరికి పార్వతీదేవిలాగా కాంతం కనిపించింది. సంతోషంతో పొంగిపోతూ, జానకమ్మ "మీా పిన్నిగారు వస్తున్నారండీ పాపం !" అన్నది మొగుడితో.

ఆ పిల్లవాడుకూడా వచ్చి ఎదురుగా నుంచుని "రండి పిన్నిగారూ, మీ కోసమే చూస్తున్నాము" అన్నాడు. జానకి ఏడుస్తూఉన్న పిల్లవాణ్ణి కాంతమ్మకు అందించింది.

"ఎందుకురా ఏడుస్తావు? ఈ మాత్రానికే! మరేం ఫరవాలేదు" అంటూ పిల్లవాణ్ణి బుజంమీద వేసుకొని చిచ్చి కొట్టేసరికి ఆ పెంకివెధవ మెదలకుండా ఊరుకొన్నాడు. ఏడుపు అంతా ఏమయిందో!

"మందు తాగడంలేదు అత్తయ్యా!" అన్నది జానకమ్మ దిగులుగాచూస్తూ.

"ఎందుకు తాగడమ్మా కోడలా! శాయి బుద్ధిమంతుడు. శాయి తాగక పోవాలిసిందే! మందు ఎట్లా ఇవ్వాలో నీ కొకటి తెలిస్తేగద ముందుసంగతి! ఏదీ ఇట్లా తీసుకురా నే నిస్తాను. ఎందుకుతాగడో నేను చూస్తాను" అన్నది కాంతం.

"ఈకాస్త తాగు నాయనా. మా తండ్రివికదూ. శాయి బుద్ధిమంతుడమ్మా. ఆ కిష్టాయి మొద్దువెధవ, ఏదీతాగడు. శాయి తాగకేం!" అని బుజ్జగిస్తే ఆ నోరులేని పసివాడు ఈ మాటలలో ఏమిమాధుర్యం గ్రహించాడో లేకపోతే శాయి మంచివాడు అనే కీర్తికి భంగము వచ్చేపని ఏమీ చేయకూడ దని అనుకొన్నాడో ఏమోగాని చటుక్కున తాగేశాడు ఆ కాస్తమందు.

కాంతమ్మ సంతోషించి "చూశావా, ఇప్పుడన్నా తెలి సిందా, వాడు బంగారుతండ్రి అని! ఇల్లా కాంతం వాడిని

మెచ్చుకొన్నది. మూడేండ్ల పసివాడికి కూడా తెలుస్తుంది కాబోలు మంచిమాటలలో ఉండే మాధుర్యం. వాడు మందే కాదు. పాలుకూడా తాగాడు. జానకమ్మ విస్తుపోయింది.

ఎక్కువగా ఆదుర్దాను పొందుతూ "జ్వరం తగ్గడం లేదు అత్తయ్యా" అన్నది జానకి. కాంతం పిల్లవాడి మీద చేయివేసి నిమిరి "జ్వరం ఉన్నది కాని అమ్మాయీ, మరేం ఫరవాలేదు. రేపటికల్లా తగ్గిపోతుంది; ఇది ఉండేజ్వరంకాదు" అని గట్టిగా నమ్మకంగా చెప్పింది.

జానకమ్మ ముఖం ఇంత అయింది. ఆ అమ్మాయి "ఏమండోయి అబ్బాయికి రేపటికల్లా జ్వరం తగ్గుతుందట ! అత్తయ్యగారు చెబుతున్నది" అన్నది సంతోషంతో మొగుడితో.

"ఏమో, ఆమెకుమట్టుకు ఏమి తెలుస్తుంది ఎప్పుడు తగ్గుతుందో" అన్నాడు జానకమ్మ మొగుడు. కాంతం లోకంలో అందరిమోస్తరు మనిషే అనుకొన్నాడు.

ఆ మాటలు విని జానకి కోపం తెచ్చుకొని "చాల్లే ఊరుకోండి. తెలిసీ తెలియని మాటలు అనబోకండి. ఆమెకు తెలియకపోతే ఎవరికి తెలుస్తుందండీ. ఆ అత్తయ్య, మీదచెయ్యి వేసి రెండుసార్లు ఇల్లాఇల్లా అన్నదా అంటే ఎటువంటి జ్వరం అయినా జారిపోవలసిందే. ఆమెది చల్లనిచెయ్యి !" అన్నది మొగుణ్ణి తెలివితక్కువవాణ్ణిగా చూస్తూ. జానకమ్మ మొగుడు కూడా తన తెలివితక్కువ తనానికి సిగ్గుపడ్డాడు.

కాంతం, జానకి విశ్వాసానికి చాలా సంతోషించి, కాస్త నవ్వుకొని "వాడికి జ్వరం తగ్గక ఏం జేస్తుందమ్మా. రేపు ప్రొద్దుటకల్లా తగ్గక కూచ్చుంటుందా! భగవంతుడి దయవల్ల తప్పకుండా జారిపోతుంది ఈ జ్వరం !" అని చెప్పి కాంతం కళ్లు మూసుకొని చేతులుజోడించి భగవంతుణ్ణి ప్రార్థించింది. "పరమేశ్వరా, ఈ బిడ్డకు ఆరోగ్యం ఇయ్యి. జ్వరం జారిపోయే లాగున చెయ్యి."

ఈమె కళ్లుమూసుకొని ప్రార్థించడము జానకమ్మచూచి ఆనంద తరంగిత అయింది. "ఎవర్ప్రార్థన అయినా తోసేస్తాడు గాని భగవంతుడు కాంతమ్మ అత్తయ్యమాట తీసివేయలేడు" అని అనుకొనేసరికి ఆ అమ్మాయికి గగుర్పాటు కలిగింది.

పిల్లవాణ్ణి జానకి చేతులలో పెట్టి "ఇందు పిల్లవాడు నిద్ర పోయినాడు. మెత్తని పక్క వేసి పడుకోబెట్టి బట్టకప్పు. వెచ్చగా పడుకొని నిద్రపోతాడు. నిద్ర లేచేసరికి జ్వరం జారవచ్చు. అని చెప్పి పిల్లవాడిని మరొకసారి ముట్టుకొని శరీరాన్నంతా తాకి, తలనిమిరి "మరేమీ ఆదుర్దాపడకు అమ్మాయ్. జ్వరం తప్పకుండా జారుతుంది. దానిముఖమే చెపుతున్నది. ఇది ఉండే జ్వరంకాదు." అని మరొకసారి ధైర్యంచెప్పి కాంతం "వెళ్ళొస్తాను అమ్మాయ్" అన్నది.

అంతవరకు జానకి, పాపం, భోజనం చెయ్యలేదు. ఏదీ, తినని స్తేగావాడు, గుక్కపట్టి ఒకటేయేడ్పు ఆయె! ఇప్పుడు ఆ అమ్మాయి మనస్సు కుదటబడ్డది! సంతోషంగా భోజనం

చేసి పిల్లవాడి మంచంప్రక్కనే తానూ మంచం వేసుకొని పడు కొని కాసేపు నిద్రపోయింది.

ఆ రోజు బాగా ఎండకాసింది. పిల్లవాడు మూసినకన్ను తెరవకుండా నిద్రపోతున్నాడు. అయినా జానకమ్మ సంతోషం గానూ, ధైర్యంగానూ ఉంది. "కాంతమ్మ అత్తయ్య చెప్పిందిగా జ్వరం జారిపోతుందని, జారితీరాలె" అనుకొన్నది.

సాయంత్రం అయిదుగంటలు అయింది. కాస్త చల్ల బడ్డది. సమీపంలోవున్న దేవాలయంలో భక్తులెవరో గంటలు మ్రోగించారు. ఇంట్లో పనిచేసుకొంటూవున్న జానకికి, ఈ గంటలు వినిపించేసరికి ఒళ్లు, ఎందుచేతనో పులకించింది. ఈ పులకింతకూ ఆమెకు ఆ క్షణంలో కలిగిన భావానికీ సంబంధం ఏమిటో చెప్పలేనుగాని ఆ అమ్మాయి గబగబావెళ్ళి కొడుకు ఒంటిపైన చెయ్యివేసి చూచుకొన్నది. జ్వరం తగ్గింది. కొద్దిగా చమటపోసింది కూడాను.

జానకికి అమితమైన ఆశ్చర్యం కలిగింది. గుళ్ళో గంటలు ఇంకా వినపడుతున్నయి. ఆ అమ్మాయి శరీరం సంతోషంతో తేలిపోతున్నది. జానకి చటుక్కున పిల్లవాణ్ణి ఎత్తుకొని, హృద యానికి గట్టిగా హత్తుకొని, కళ్ళుమూసుకొని "భూమిమీద దేవతలు ఉన్నారన్నమాట నిజమేనా తండ్రీ!" అని అంటూ ఆ పరమేశ్వరునికి మనస్సులోనే నమస్కరించింది.

## ౪

జానకమ్మ ఇంటిదగ్గరనుంచి కాంతం గబగబా ఇంటికి వచ్చేసింది. ముసలాయన నిద్రలేచే వేళ అయింది. కోడలు కాఫీ యిచ్చిందో ఇయ్యలేదో అని ఆమెకు ఆదుర్దా కలిగింది. ఇంట్లో అడుగు పెట్టీపెట్టడముతోనే "సుందరీ, మీ మామగారికి కాఫీ ఇచ్చావా?" అని అడిగింది.

అప్పుడే కుంపటి రాజేస్తున్న సుందరి పశ్చాత్తాప పరితప్త అయిన ముఖంపెట్టి "లేదు అత్తయ్యా మీరు వెళ్ళినప్పటి నుంచీ ఇది ఒకటే యేడుప్పు! చంకదిగిందనుకొన్నారా! మీరు అడిగితే ఏడ్వనని బుద్ధిమంతురాలులాగ తలఊపిందా, మీరు అట్లా వెళ్ళారు...అదే మొదలు అనుకోండి, బా అమ్మా, బా అమ్మా అంటూ ఒకటే ఏడ్పు! ఏంచెయ్యను...చెప్పండి అత్తయ్యా! మామగారికి కాఫీ ఇయ్యకపోతే మీకు కష్టంగా ఉంటుందని నాకు తెలుసు. అయితే ఏంజేయను. కాసేపు అవస్థపడి చివరకు దాన్ని మామగారికి ఇచ్చి, ఇప్పుడే వచ్చాను. వింటున్నారా ఎల్లాగ గుక్కబట్టి ఏడుస్తున్నదో!" అన్నది.

కాంతం గునగునా నడిచిపోయి భర్త చేతుల్లో నిలువక "బా అమ్మా పోతా"నని మంకుపట్టుపట్టి ఏడుస్తూన్న మనుమరాలును తీసికొని, బుజానవేసుకొని "నా తల్లే చచ్చిపోయినానే తల్లీ! నా కోసం ఏడుస్తున్నావా తల్లీ! మా అమ్మో! వచ్చాగా అమ్మా! నా బంగారు కొండవుకదూ! ఏడవబోకమ్మా.

వచ్చాగా !" అని వేయివిధాల బుజ్జగిస్తే అది ఎట్లాగో చివరకు తృప్తిపడి బాఅమ్మ బుజానికి అతుక్కుపోయింది.

శేషు చాలాసేపు ఏడ్చినట్లుంది. ఈ విషయం తలచు కొనేసరికి మొదట కాంతానికి కాస్త విచారము కలిగిందిగాని వెంటనే అది కోడలుపై కోపంగా పరిణమించింది.

"పిల్లను ఆడించుకోవడము తెలియదేమే కోడలా ? నువ్వు ఈ సంసారం ఎట్లా ఈదుతావూఅంట ! నేను ఎప్పుడూ ఉంటానాచెప్పు ? నేను ఎట్లాగూ కాశీకి వెళ్ళిపోయే దాన్నే ఆయే ! నేనువెడితే నీవు ఏంజేసుదల్చుకున్నావే కోడలుపిల్లా, ఆ సంగతి కాస్త చెప్పూ ?"

"ఇప్పుడు వెళ్ళరు గదండీ."

"ఇప్పుడు కాకపోతే రేపు ! ఆ పుట్టేవాణ్ణిచూచి వెళ్ళి పోవలసిన దాన్నేగదటే !" అన్నది కాంతం మనుమరాలును ఎత్తుకొని ఆడిస్తూ.

సుందరి తలవంచుకొని తనలోతాను నవ్వుకొంటూ "మీరు వెళ్ళకుండా ఉండాలంటే ఏంజెయ్యాలో ఆ రహస్యం నాకు తెలిసిందిగా అత్తయ్యా ! నా జాగ్రత్తలో నేనుఉంటాను" అన్నది.

కాంతం "భడవా, ఎన్నిమాటలు నేర్చావే! ఎన్ని ఊహాలున్నయ్యో నీ కడుపులో !" అని పకపకానవ్వింది.

ఇంతలో కాఫీ తయారు అయింది. కాంతం కొంచెము కాఫీ వెండిగ్లాసులోపోసి, మనుమరాలుకిచ్చి, "తాగుతల్లీ ! తాగినతరువాత తాతయ్యను పిలుచుకురా కాఫీకి" అన్నది.

శేషు తనకిచ్చిన కాఫీ తాగకుండానే పరిగెత్తుకుంటూ ముందుగదిలోకిపోయి "తాతయ్యా, బామ్మ పిలుస్తుంది, రా కాఫీ" అని చెప్పింది.

ఆ ముసలాయన వెంటనేరాలేదు. వీధిగదిలో పడక కుర్చీలో కూచ్చుని ఏదో ఆలోచిస్తూ ఉన్నాడు. పసిది కాసేపు చూచి వంటయింట్లోకివచ్చి "తాతయ్యరాడు" అని చెప్పేసింది బామ్మతో...ఏ సందేహానికి ఆస్కారంలేని పద్ధతిలో.

"ఎందుకురారే తల్లి ?" అని అడిగింది కాంతం.

"ఏమో నాకు తెలియదు" అన్నది ఆ పసిపిల్ల.

ఈ మాటలు వింటూఉన్న సుందరి, ఎవరూ చెప్పక ముందే గబగబా వెళ్ళి "కాఫీకి రండి, మామయ్యగారూ" అని వినయంగా అడిగింది.

ముసలాయన ముఖం చిట్లించి "నాకు అక్కర్లేదని చెప్పు మీ అత్తయ్యతో" అన్నాడు.

అసలు సంగతి ఏమిటీ అంటే— ఆయనకు బాగా కోపం వచ్చింది. మధ్యాహ్నం నిద్రలేవడముతోనే ఒక అప్పుడంతిని ఒకకప్పు కాఫీ తాగడము ఆయనకు అలవాటు. ఈ విషయంలో ఒకక్షణం ఆలస్యం అయినా ఆయన ఓర్చుకోలేడు.

వేళకు కాఫీ అందక పోవటంవల్లనే వారికి కోపం వచ్చిందని కోడలు గ్రహించింది. అత్తగారు ఆ సంగతి చెప్పేవెళ్ళింది. తానే వేళకు కాఫీచేసి ఇయ్యలేక పోయింది. తప్పు తనదేనని

సుందరి గ్రహించి, కొంచెం విచారంగానే అన్నది. "రండి మామయ్యగారూ!" అని.

కోపం బాగా వచ్చినపుడు ఈమాత్రపు మంచిమాటలు తృప్తిని ఇయ్యవు. అందుకనే ఆయన మరీ ముడుచుకు పోయి నాడు. కోడలు విచారాన్ని పొందుతున్నది అని అయినా గ్రహించ లేదు. ఆయనకు మతిపోయిందన్నా కూడా అట్టే అబద్ధం కాదు.

కోడలు ఈ మాటలు అంటూ ఉన్నపుడు ఆయన ఆ అమ్మాయి ముఖం అయినా చూడక పసిపిల్లవాడిలాగ తల గిరగిరాతిప్పి "నాకు ఇవ్వాళ కాఫీ అక్కర్లేదని చెప్పు మీ అత్తయ్యకి. పో అమ్మా, ఆ మాట చెప్పు" అన్నాడు కాస్త కోపంతోనూ కాస్త అనునయంతోనూ.

ఇక లాభంలేదని కోడలు దీనవదనంతో అక్కడనుంచి వెళ్లిపోయి, అత్తగారితో రహస్యంగా చెప్పింది చేతులు తిప్పు కొంటూ "మామయ్యగారికి బాగా కోపం వచ్చింది అత్తయ్యా" అని.

భర్తకు కోపం వచ్చినదని తెలిసికూడా కాంతం ఆట్టే బిత్తరపోక, "వేళకు కాఫీ లేకపోతే ఆయన అంతేనమ్మా," అన్నది, చల్లగా అచంచలిత కంఠంతో.

సుందరి విచార సూచకమైన వదనంతో తలవంచుకొని, "నాదే తప్పు అత్తయ్యా, పొరపాటు అయిపోయింది." అన్నది.

"నీవేమిటా మనస్సు కష్టపెట్టుకోకమ్మా. కాక పోయినా ఆయన మరీ పసి పిల్లవాడు అయిపోతున్నారు. కోపమేమిటి నా తలకాయ. ఈ మాత్రానికే కోపం రావాలా!" అన్నది. ఆయన కోపాన్ని అంతగా లెక్క జేయనట్టే మాట్లాడింది కాంతం.

మాట్లాడి, తానే స్వయంగా వెళ్ళి భర్తయెదుట నిలువబడి నవ్వుతూ అన్నది "రండి, కాఫీ చల్లారి పోతున్నది."

'నాకు అక్కరలేదు' అని ముసలాయన గునుపుగా అన్నాడు.

ముసలాయన పసిపిల్లవాడిలాగ గునుపుగా మాట్లాడటం చూస్తే కాంతానికి నవ్వు వచ్చింది, జాలీకలిగింది. అందుకని బుజ్జగింపుగా అన్నది "ఎందుకు అక్కర్లేక పోవాలె. కోపం వచ్చిందిటండీ. నేను కాస్త అటు వెళ్ళాననేగా మీకు కోపం! పోనీలెండి, రేపటినుంచీ వెళ్లను. కాస్త తాగివెళ్ళండి. రండి"

బాబుగారి కోపం ఒక మోస్తరుది అయినట్లయితే, ఈ పాటికి పోవలసిందే! కాని పోలేదు. తన సంగతి ఎవ్వరూ చూడడములేదనుకొని ఆయన ఈ కోపాన్ని పట్టించుకొన్నాడు. కాంతం ఎంతసేపు నుంచున్నా లేచిరాక, మూతి ముడుచుకొని కుర్చీలో కూర్చున్నాడు. కాంతం అక్కడే నిలువబడి ఆయనవంకే తదేకదీక్షతో చూస్తున్నది. భర్త ముఖంలో వార్ధక్యచ్ఛాయలు ఎంతస్ఫుటంగా కనిపిస్తున్నవి! బుగ్గలు జారి

పోయినవి. కళ్ళక్రింద చిరుముడుతలు ఏర్పడ్డవి. ముఖ్యంగా మునిగడ్డంక్రింద ముడుతలు ఆయన ముసలితనాన్ని గుర్తింపజేస్తున్నవి.

కాంతం కళ్ళు మూసుకొన్నది. యౌవనంలో ఉన్నప్పుడు తనభర్త ఎల్లాగ ఉండేవాడో జ్ఞాపకం తెచ్చుకొన్నది. చామనచాయలో మెరుస్తూ ఉండే దేహచ్ఛాయ. బిగువైన కండలుగల శరీరం! ఆ రూపానికీ ఈ రూపానికీ ఎంతభేదం ఉన్నది! నలభైయేండ్లు కుటుంబ సంరక్షణకై ఆయన పడ్డశ్రమ అంతా, ఆయన శరీరంపైనున్న ముడుతలలోనూ, రేఖలలోనూ, వంపులలోనూ విస్పష్టమైంది ఆమెకు.

కాంతం భర్త ముఖాన్ని ఇంకా కాసేపు నిదానించి చూచింది. "ఈ రూపం మటుకు అందమైనదికాదా! దీనికుండే అందము దీనికీ ఉన్నది. యౌవనమూ అందమైనదే; వార్ధక్యమూ అందమైనదే." అని అనుకున్నది.

ఈ భావాలన్నీ ఆమె మనోవీధిలో గిరగిరా తిరిగిపోయినవి. ఆమె తెప్పరిల్లి చిరునవ్వుతో మళ్ళీ అన్నది. "రండి, కాఫీ చల్లారి పోవటంలేదూ! ఇకరండి, మీకు వేళకు కాఫీ ఇయ్యక పోవటం తప్పేనని ఒప్పుకొన్నానుగా"

ముసలాయనకు కాంతం అనునయ వాక్యాలు వినిపించడము లేదు. ఆయన వేరే ఇంకొకవిషయమై ఆలోచిస్తున్నాడు. చిన్నతనంలో ఒకరోజున ఇల్లాగే తనకు కోపం వచ్చింది,

అప్పుడూ కాఫీ ఇయ్యలేదనే ! అప్పుడూ ఇల్లాగే కాంతం వచ్చి కాఫీ తాగండి అని బ్రతిమిలాడితే తాను లేవలేదు. అప్పుడు కాంతం "ఎట్లా తాగకుండా ఉంటారో అదీ చూస్తానుగా !" అని మధురకంఠంతో అని, కాఫీ కప్పు తెచ్చి, పక్కనున్న టీపాయ్ పైనబెట్టి, తానుకూర్చున్న కుర్చీలోనే చోటుచేసుకొని కూర్చుని, తనపైకి ఎడంచేయివేసి వక్షస్థలానికి దగ్గరగా లాక్కొని బుజ్జగిస్తూ, కుడిచేతో కాఫీకప్పు తీసికొని తననోటికి అందించింది. ఆ దృశ్యమంతా ఇప్పుడు కళ్లకుకట్టినట్టు కనిపించింది, ముసలాయనకు.

ఆనాడు తాను అనుభవించిన స్వర్గసౌఖ్యాన్నిగూర్చి పెద్దబాబు ఆలోచిస్తున్నాడు. స్మృతి తలాల్లోనుంచి ఉబికి ఉబికి వస్తున్నయి ఏవేవో దివ్యానుభూతులు !

ఆనాడు రత్నశలాకలాగ ఉన్న కాంతం దేహకాంతులు తనపైబడ్డవి. ఆ దివ్యజ్యోతిలో తనశరీరం తళతళలాడింది. ఆ సమయాన తన తనువుపై అంకురించిన పులకలు, ఎప్పుడూ అట్లాగే ఉండి పోతయ్యేమో అని అనిపించినది ఆ వృద్ధరసికునికి. ప్రియాకబరీచ్యుత మల్లికా కుసుమములు కొన్ని తనవొడిలోపడి పసిపిల్లల్లాగ కిలకిలా నవ్వినవి. వికసితపుష్ప వినిర్గత పరిమళముచే తనకు తన్మయత్వం కలిగింది. పీయూష ఫేనమువలె మెరుస్తూ ఉన్న ఆమె చిరునవ్వు కాంతులముందు తన కోపాంధకారము మాయమైపోయినది. ఆమె సాంద్ర కుటిల కుంతలములను చేతితో తాకుతూ ఆమె వచోమాధుర్యమునూ కమనీయమైన

కాఫీని ఒకేసారి ఆస్వాదించిన ఆనాటి సంగతి జ్ఞాపకానికి వచ్చింది.

ముసలిబాబు ఇంకా పురానుభూత సౌఖ్యాన్నిగూర్చి తలపోస్తున్నాడు. కాంతం కాసేపు అల్లాగే నిలువబడి, భర్త ఎంతసేపటికీ లేచిరాక పోవటంచూచి, "ఏమండీ, రారేం?" అన్నది. 'రాను' అన్నాడు ఆయన. కాంతం "ఎందుకురారో అదీ చూస్తానుగా!" అని చరచరా వెళ్ళిపోయింది.

బాబు ఈ మాటవిని నవ్వుకొన్నాడు. పూర్వం చిన్న తనంలోనూ ఆమాటే అన్నది. అల్లాగే మళ్ళీవచ్చి, కాంతం, తన కరపల్లవముతో స్పృశిస్తుందా భర్తను!!

"బాబూ, ఆమె కరములు ఇంకా పల్లవములే అనుకొన్నావా! అయినా ఆమె ఆ పనిచెయ్యదు. ఆ రోజులూ రావు; ఆ ఆనందమూరాదు." అని ఆ ముసలాయనకు ఎవ్వరూ చెప్పేవాళ్ళు లేకపోవడము మూలానే ఆయన అల్లాగ కాఫీ తాగనని భీష్మించుకొని కూర్చున్నాడు. కాసేపుచూచి కాంతం వెళ్ళిపోయింది.

వెళ్ళి మనుమరాలుతో చెప్పింది. "తల్లీ, తాతయ్యను చెయ్యిపట్టుకొని లాక్కురా. నీవువస్తేగాని నేను కాఫీ తాగనను. లేచినదాకా అక్కడే కూర్చో. రాక ఏంజేస్తారో చూస్తాను" అని ఆ పసిదాన్ని ఉసిగొల్పింది ముసలాయన మీదికి.

ఆ పసిది తానుచెయ్యవలసిన పనినీ తత్కార్యసాధనకై తాను అవలంబించవలసిన విధానాన్నీ నిమిషంలోకి ఊహించుకొని తాతయ్య గదిలోకిపోయి ముందు సామమార్గావలంబయై "రా, తాతయ్యా, బా అమ్మ కాఫీకి రమ్మంటున్నది" అన్నది. తాతగారికేం తెలుసు ఆ పసిదాని కడుపులో పెద్ద ఊహ లున్నాయని. "నాకు కాఫీ అక్కర్లేదమ్మా వెళ్ళు తల్లీ" అన్నాడు.

"రావా తాతయ్యా ?"

"నాకు కాఫీ తాగాలని లేదే !"

"నీవు తాగకపోతే నేనూ తాగను" అని హఠంవేసుకు కూర్చున్నది చిట్టితల్లి.

"నీవుపోయి తాగిరావే శేషుతల్లీ. నేను కాసేపుఉండి వస్తాగా" అని ఆ చిన్నదాన్ని మోసపుచ్చాలని చూశాడు పెదబాబు. కాని అది కదిలితేగా ! అక్కడే కూర్చున్నది నీవు వచ్చి తాగితేగాని నేను తాగనని! పైగా ఏడుపుముఖం పెట్టింది. ఏంజేస్తాడు ముసలాయన ! ఆలోచించాడు ! మనుమరాలును ఏడ్పించటం ఇష్టంలేదు ! శాంతంవేసిన పాచికపారింది. "సరే, రావే" అంటూ లేచి వంటింటివైపు నడిచాడు. అరవై యేండ్ల ముసలితనంలో ప్రణయ కలహం జరపాలంటే సాగుతుందా ! అది ఈ విధంగానే పర్యవసిస్తుంది.

తాతగారు వంటయింటివైపు ముఖంపెట్టి రెండు అడుగులువేసి వెనక్కితిరిగి చూశాడు. శేషు అక్కడే కూర్చుని

ఉన్నది బుద్ధమూర్తి పెట్టుకొని! ఇదేమిటి, రాదేం!

"రావేమే శేషూ?"

"నేను రాను."

అరె! దీనికి ఎందుకు కోపం వచ్చింది! కాంతంతో వచ్చిన ప్రణయ కలహం అంతమైంది. కాని ఇప్పుడు మనుమ రాలితో మరో ప్రణయకలహం ప్రారంభమైనది.

దీని సఱకవేరు. కామసూత్రాలు వ్రాసిన వాత్స్యాయన మహాఋషికికూడా ఈ విలాసక్రీడను గురించి బొత్తిగా తెలియ దనే నా అభిప్రాయం.

అది రాకుండా తానువెళ్ళాడా, అది పెద్దగా ఏడ్చే మాట ఎట్లాగూ నిజం. ఏడుప్పు అప్పుడే దాని ముఖంపైన నాలుగుచెరగులూ పరుచుకు కూర్చున్నది. ఏంజేయాలె?

ఏంజేయాలో తాతగారికి తెలియకపోలేదు. దాన్ని బ్రతిమిలాడి తీసుకురావాలె.

ముసలాయన మళ్లీ వెనక్కివెళ్ళి 'రా తల్లీ' అన్నాడు. అది ఇంకా బెట్టుచేసింది. చెయ్యిపట్టుకొని లేవమన్నాడు. అది లేవలేదు. ఎత్తుకోబోయినాడు. ఊహూ, అది జారిపోయింది. "ఏమిటేతల్లీ, ఏంకావాలె? ఏం జెయ్యమంటావు?" అన్నాడు ఆ వృద్ధరసికుడు.

"గుల్లం" అన్నదిపాప.

ఈ మాట విన్నమీదట తాతగారి పెదవులపై చిరు నవ్వు ఒకటి తాండవించింది. ప్రతిభావంతుడై పండితుల

మన్ననలకు పాత్రుడై లబ్ధప్రతిష్ఠుడైన ఆ కథక చక్రవర్తి చటుక్కున వంగి మనుమరాలును వీపుమీద ఎక్కించుకొని వంటింటివైపు నడువసాగినాడు.

పసిదాని ఆనందానికి అవధిలేదు. ఈ గుఱ్ఱపుస్వారి దానికి అంతులేని ఆనందాన్నిస్తున్నది.

"హై! హై! హై! ఇతు ఇతు."

ఈ కొత్త గుఱ్ఱం వినయ విధేయతలు ప్రదర్శిస్తూ మనుమరాలిని ఎక్కించుకొని వంటయింట్లోకి వచ్చింది.

తాతగారు ఆ క్షణంలో బాహ్యప్రపంచాన్ని మరచిపోయి బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్నాడు. ఆయనకు ఎదురుగా కాంతమూ, కోడలూ నుంచుని ఉన్నారు.

ఈ సుందరదృశ్యాన్ని చూచింది కోడలూ కాంతమే కావటంచేత, ఆ విషయం అట్లాగే ఉండిపోయింది. ఏ పెద్దనో, శ్రీనాధుడో చూచి ఉండకపోవడం మన దురదృష్టం. చూచి ఉన్నట్లయితే రెండు రసవంతమైన మహాకావ్యాలు మనకు లభించేవి.

ఈ సుందర దృశ్యాన్ని చూచి సుందరి ఎంత సంతోషించిందో నేను చెప్పలేను. కాని, కాంతం హృద్గతభావం మాత్రం నేను చెప్పగలను. స్వర్గంలో అనుభవింపబోయే సుఖము ఇంతకంటే ఉత్కృష్టమైనది కాదేమోనని ఆ క్షణంలో ఆమెకు సందేహం కలిగిన మాట మాత్రము నిజము.

ఆ మెకళ్ళు తళతళా మెరసిపోయినవి. ఆ చల్లనిచూపులు మనుమరాలిపై ప్రసరించినవి. కోడలు చెక్కిళ్ళను తాకినవి. ముసలాయన ముఖంపై పడి మిలమిల మెరసినవి. ఆమె హృదయం ద్రవించిపోయింది. ఆనందమయము అయింది.

*  *  *

కాంతానికి ఒక్క విషయంలో మాత్రం కాస్త దిగులు తప్పటంలేదు. ఆ సీత సంసారం ఏమీ బాగుండలేదు. ఆ యింట్లో శాంతి అంటూ లేదు. అత్తాకోడళ్ళు పోట్లాడుకొని చస్తున్నారు.

సీతను రాచి రంపాన పెడుతున్నది ఆ అత్తగారు. ఒక్క నిమిషం అయినా ఊరుకోదు. ఏదో కారణం కల్పించుకొని కోడలును తిడుతూ ఉంటుంది. సీత సరిగ్గా రెండుపూటలా తిండికూడా మానేసింది. అంతకంతకు చిక్కిపోతున్నది.

కాంతం అప్పుడప్పుడు వెళ్లి ధైర్యంచెప్పి వస్తున్నది. ఒక రోజున సీత అన్నది "నేను ఈ బాధలు పడలేనువదినా. నేను చచ్చిపోతే అందరూ సుఖపడతారు అనుకొంటాను" ఈ మాటలు అని సీత కళ్ళనీళ్ళు పెట్టుకొన్నది.

కాంతం కూడా కళ్ళనీళ్లు పెట్టుకొని "ఏంజేస్తావు వదినా, ఆడజన్మ అటువంటిది. కాదని మనం తిరుగబడి చేయగలది ఏమన్నా ఉన్నదా చెప్పు! చచ్చి సాధించేది ఏదీ లేదమ్మా!" అన్నది.

"ఈ రంపపుకోత నేను పడలేను వదినా. ఎక్కడికైనా వెళ్ళిపోతాను" అని సీత వెక్కి వెక్కి ఏడ్చింది.

సీతను గట్టిగా కౌగలించుకొని, తానుకూడా ఏడ్చి, చివరకు కాంతం అన్నది. "పరాయి దేశాలలో అంటేట వదినా. కాని ఇల్లాగ మనం చేయగలమా! కొట్టినా తిట్టినా యింట్లోనే ఉంటాము. బయటికెళ్ళి ఏంజెయ్యాలె తల్లీ! పుట్టింటికి వెళితే ఏమైనా గౌరవం ఉంటుందా ఏమన్నా నా. ఎబ్బె! కష్టమో సుఖమో మొగుడిదగ్గర పడి ఉండడమే ఆడదానికి గౌరవం. కష్టాలు కాపురముంటాయా? ఏ నిమిషానికి ఏమి మార్పు వస్తుందో ఎవరుచెప్పగలరు! దిగులు పడబోకు వదినా. నీకేమమ్మా పండంటి బిడ్డలున్నారు. వాళ్ళను చూచుకొన్ని అయినా బ్రతికుండాలె."

"వాళ్ళను చూచుకొనే బ్రతుకుతున్నాను వదినా!" అన్నది సీత. కాంతం సీతను ఓస్సుపహించమని వెయ్యివిధాల చెప్పి, ఎట్లాగో మనస్సు కుదుటబడేటట్టు చేసి యింటికొచ్చింది.

కాంతం ఆ రోజు అంతా సంతోషంతోనూ తృప్తి తోనూ తిరిగింది. ఆమెవదనము మధుర మందహాస రేఖా సుప్రసన్నము అయింది. ఇటువంటి అతి స్వల్పమనతగిన, సుకృతములచేతనే మానవత్వం దేవత్వాన్ని పొందుతుంది.

౫

తెల్లవారటానికి పూర్వమే కాంతం స్నానంచేసి తులసి పూజ చేసుకొంటూ ఉన్నది. మామిడిచిగురు రంగుచీర కట్టు కున్నది. జరీపేటుగల కనకాంబరంరంగు రవిక తొడుక్కున్నది. ఆమె జారుముడిపైన రెండు మందార పుష్పములు ప్రకాశిస్తు న్నవి.

యాభైయేండ్ల ముత్తయిదువయొక్క మనోహరమైన ఆకృతిని చూడాలంటే కాంతాన్నే చూడాలె. ఆమె ముఖాన పెద్దబొట్టు పెట్టుకొన్నది. వేలకొలది ఆర్యసీమంతినులలో ప్రకా శిస్తున్న పవిత్రమైన తేజస్సు ఆరోజు ఆమెలో కనిపించింది. గృహిణీత్వము మూర్తీభవించి రూపుకట్టినది కాంతంలోనే. కాంతం గృహిణీత్వమునుండి దేవతాత్వమును పొందేదశలో ఉంది మరి ఇప్పుడు. పుణ్యస్త్రీల కళ్ళల్లోఉండే తళతళలూ దేవతల చూపులలోఉండే మిలమిలలూ చూడాలంటే కాంతం కళ్ళల్లోనే చూడాలె. చిత్రకారుడు తీర్చి దిద్దలేని మాతృత్వ మాధుర్యం కాంతం చూపులోనూ నడకలలోనూ, వాక్కు లోనూ కనపడుతుంది.

కాంతం సౌందర్యము శారీరకముకాదు. ఆమె మొగ ములో విస్పష్టముగా కనుపించే శాంతీ, సౌశీల్యమూ విన యమూ, ప్రధానంగా ఇల్లాలితనమూ మనలను ఆకర్షిస్తూ ఉంటవి. వినయాది సద్గుణస్ఫోరకమైన ఆమె చూపులూ,

మధుర మందహాసంతోకూడిన ఆమె ప్రసన్న వదనమూ మనలను ఆమెయెడల వినమ్రులనుగా చేస్తవి.

ఆమె చరణద్వయము మన చూపులను ఆకర్షించే శక్తి గలవి. ఆమె మృదుపాదములు సోకినంతమేర భూమి పవిత్రమై మనోహరారామము అయిపోతుంది.

కొన్ని పూవులు అడవిలోపుట్టి అడవిలో పెరుగుతవి. అవి ఎందుకూ కొరగాకుండాపోతవి. దేవాలయ సమీప భూములలో పూచిన కొన్ని పుష్పములు మాత్రం ఆ రాధికా వల్లభుని పాదపద్మములను అలంకరిస్తవి. వానికాభాగ్యం ఎల్లాగ కలిగింది...కాంతం మెట్టిన ప్రదేశములలో పుట్టి పెరగడంవల్లనే.

ఆమె వాఙ్మాధుర్యాన్నే వృద్ధ సమీరుడు పుష్పజాతి కంతా కొంచెము కొంచెముగా పంచియిస్తున్నాడు.

కాంతం దొడ్డివైపునకు నడిచింది. గాలిదేవుడు పువ్వు పువ్వుదగ్గరకూపోయి కాంతం వస్తున్నదని చెప్పాడు. అక్కడున్న పూలమొక్కలన్నీ సంతోషంతో ఊగిపోయినవి. ఆ ఆవరణలో రకరకముల పూలు ఉన్నాయి. ముద్దబంతి పూలు, రెక్క బంతిపూలు, పోక బంతిపూలు వరుసలు వరుసలుగా పూచినవి. గుమ్మడిపాదు ఒకటి దొడ్డిఅంతా తనదే అయినట్లు, ఆక్రమించుకొని, పెద్ద సంసారాన్ని పెట్టి పోషిస్తున్నది. బంగారపు గిన్నెలలాగ, గుమ్మడిపూలు ధగధగా మెరుస్తున్నవి. రాత్రి పూట ఆ గిన్నెలలో దేవతలు అమృతము పోసుకొని తాగు

తాను. అందుకనే దేవతా పరిభుక్తశేషమైన అమృతబిందువులు కొన్ని ఆ పూలగిన్నెలపైనుంచి జారుతున్నవి. దగ్గరలోనున్న చిన్నచిన్న చెట్ల ఆకులనుండి ముత్యాలు రాలుతున్నవి. చంద్రకాంతములు, నీతారత్నములు అచ్చట ఉన్న కారణాన ఆప్రదేశమంతా సుమనో మనోభిరామంగా ఉంది. రాధికా వల్లభుని పాదపద్మ స్పర్శకై అవన్నీ తహతహ లాడిపోతున్నవి. ఈపుష్ప కన్యలన్నీ కూడా వికసిత వదనాలతో అటూఇటూ చూచినవి కాంతం ఎటునుంచి వస్తున్నదోఅని. చేమంతి సీమంతిని ఒళ్ళంతా కళ్లు జేసికొని ఆ తల్లివంకచూచి అటుఊగి ఇటుఊగి నమస్కరించింది. బంతులు అవనత ముఖులై ఆమె పాదాలపై దృష్టినిలపి ధ్యాననిమగ్నతను పొందినవి. ఆమె పారిజాతవృక్షం క్రిందికి వచ్చింది. పారిజాతం సంతోషంతో పొంగిపోయి ఆమెపై పూలవర్షం కురిపించింది. గడ్డిపూలు వంగివంగి ఆమె పాదపద్మములను ముద్దుపెట్టుకొని గర్వంతో తలలెత్తినవి.

వివిధ పుష్పాల సువాసనలన్నీ ప్రోగుజేసి గంధవహుడు కాంతానికి అర్పించాడు. కాంతం శరీరం ఆపాదమస్తకం పుష్ప సౌరభంతో నిండిపోయింది.

కాంతం ఒకటి రెండు చేమంతి పూలను మిక్కిలి మృదువుగాకోసి, వానితో తన ధమ్మిల్లమును అలంకరించుకొన్నది.

రాయంచ నడకలలో పర్యాయము ఉన్నదికాని కాంతం నడకలలో దైవత్వముంది. ఆమె ప్రతి అవయవమూ, పవిత్రమై పూజాభాజనమైనది.

ముసలాయనకూడా ఆ సమయానికే ఆ పుష్పవనంలోకి వచ్చాడు. వచ్చి కాంతాన్ని సమీపించి కొంచెముదూరంలో నుంచున్నాడు.

ఆ దంపతుల సమాగమము కొన్ని సంవత్సరముల క్రింద వారు యౌవనంలో ఉన్నపుడు జరిగి ఉన్నట్లయితే, వారిద్దరి మధ్య ఆదూరం ఉండేది కాదు. ఇప్పుడు అట్టి సన్నివేశముల తీరే మారిపోయింది. భర్త ఇప్పుడామెను కామతృష్ణతో కన్నెత్తి చూడలేడు. ఆమె ప్రతి అవయవమూ ఇప్పుడు పవిత్రమై పూజాభాజనం అయింది. వారి దాంపత్య మిప్పుడు పవిత్రభావ సమ్మిశ్రితమై, మధురభావ స్ఫోరకమై మృదుల భావ పరామృష్టమై, శరీర సంసర్గ ప్రధానభావేతరమై ప్రభాసిస్తూ ఉన్నది.

దాంపత్య జీవితము మొదట శృంగార రసవాహినిలాగ ధగధగా మెరిసిపోతూఉండి కరుణాది రసవాహినుల కలయికచే, ఒక వింతనడక నడిచి, నడిచి చివరకు శాంత రసము ప్రధానముగా కలది అవుతుంది.

కాంతం జీవితంకూడా అట్లాగే నడిచింది. ఇప్పుడు ఆమె జీవితమును ప్రశాంతత, గాంభీర్యము అలముకొనినవి.

కాంతం ఏమీ ఘనకార్యాలు చెయ్యటంలేదు. భక్తిని గురించి ఉపన్యాసాలు ఇయ్యదు. ఉపనిషద్వేదాంతము ఆమెకు తెలియదు. కష్టమో సుఖమో ఈ భూమిమీదనున్న నాలుగు

రోజులూ తృప్తితోనూ ఆనందంతోనూ కాలం గడపడమే ఆమె మతం.

కాంతం దొడ్లోనుంచి యింట్లోకి వచ్చేసరికి కోడలు అప్పుడే నిద్రలేచి వస్తున్నది. కాంతాన్ని చూచి ఆపిల్ల నిశ్చేష్టురాలైపోయింది. కాంతంలో అంత తేజస్సు ఆపిల్ల ఎప్పుడూ చూడలేదు. తన రెండుకళ్లూ అప్పజెప్పి చూస్తూ నిలబడి పోయింది. ఆ అమ్మాయికి ఏదో ఆశ్చర్యం కలిగింది. ఏవో మధురానంద రేఖలు ఆమె మొగములో కనపడినవి. ఏదో దివ్యదర్శనమైనట్లు ఆ పిల్లకు తోచినది. ఏదో అనిర్వచనీయమైన ఆనందము ఆ బిడ్డ అకారణముగ పొందసాగింది. ఆపిల్ల మనస్సు ఒకవిచిత్ర స్పందనాన్ని పొందినది. చూస్తూ నిలబడి పోయింది.

"ఏమిటే పిల్లా అల్లాచూస్తావేం!" అన్నది కాంతం నవ్వుతూ.

ఆ చిరునవ్వు మానవులు నవ్వే నవ్వేనా! మానవ స్త్రీ నవ్వులో, అంత సౌందర్యం అంత సౌకుమార్యం అంత మాధుర్యం మిశ్రితములై ఉంటవా?

ఆపిల్ల ఏమి జవాబు చెపుతుంది. అయినా ఆ చిన్న పిల్లకు, మనస్సులో కలిగిన విచిత్రానుభూతిని మాటలలోకి మార్చే శక్తిలేదు.

"ఏంలేదు అత్తయ్యా, మీరేదో కొత్తగా ఉన్నారు ఇవ్వాళ" అనిమాత్రం అనగలిగింది.

"కొత్తగా ఉన్నానా? ఎట్లా ఉన్నానే? అయినా నీకు సరిగా తెలకువ రాలేదేమో! సరేగాని అమ్మాయ్ తొందరగా కాలకృత్యాలు తీర్చుకొని స్నానం కానియ్యి. శుక్రవారం పూటగదా, తలంటిస్నానం చెయ్యాలట అమ్మాయ్."

"వద్దు అత్తయ్యా. ఇవ్వాళకు మామూలు స్నానం చేస్తాను!" అన్నది సుందరి.

కాంతానికి కోపంవచ్చి అన్నది "కూడని పనులు చేస్తా ఉంటే ఊరుకోమంటావ్రటేపిల్లా! అల్లా ఎప్పటికీ వీల్లేదే కోడలా! నే నున్నంతకాలము నా మాట ప్రకారము జరగాలిసిందే ఈ యింట్లో. తల అంటుకొని స్నానం చెయ్యకుండా శుక్రవారపు ప్రొద్దులు కూడరాదే సుందరీ" అని స్పష్టంగా చెప్పేసింది కాంతం.

కోడలు యథావిధిగా తల అంటుకొన్నది. ఆ రోజున కాంతం పులగం వండింది. ప్రతి శుక్రవారమూ అంతే.

కాంతం సుందరిని పూర్వపద్ధతులలో తయారుచేసింది. ఆపిల్ల కామోద్రిక్తములైన చూపులు చూడదు. నడకలు నడవదు. పోకడలు పోదు.

కాంతం ఆ పిల్లకు ఇల్లాలి తనమును వృద్ధిజేసే నడకలు సత్సాంప్రదాయానుగుణంగా నేర్పింది.

సుందరి రంగుచీరెలు ధరిస్తుంది. తగుమాత్రపు సొమ్ములున్నవి. చెవులకు లోలకులు లేవు. పక్కపాపిళ్ళు లేవు. ఆపిల్ల నడకలో కులుకులుండవు. మర్యాద ఉంటుంది. వినయము కని

పిస్తుంది. అది అందమైన నడక కాదని ఎవరూ అనరు. ఏ యువకుడైనాసరే, ఆ పిల్లవంక చూచి "చెల్లెలు" అనుకోవలసిందే. అందుకు భిన్నమైన భావము ఎవ్వరికీ కలుగదు. కాంతం కోడలును ఈ విధంగా తన అభిరుచులకు అనుగుణంగా దిద్దుకొన్నది. కోడలుకూడా కాంతం చెప్పుచేతలలో ఉండి, ఆమె అడుగుజాడలలో నడిచి, ఆమె ప్రతిష్ఠకు ఏవిధా భంగంలేని పద్ధతులలో ప్రవర్తిస్తున్నది.

౬

ఒకరోజున కాంతం పెందలాడే లేచి స్నానంచేసి తులసిపూజ చేసికొని వంటయింట్లోకి వెళ్లబోతూవున్న సమయాన ఆరేండ్ల పిల్ల ఒకతె ఏడుస్తూ వచ్చింది.

"ఎవరే వచ్చింది ?" అని కేకవేసింది కాంతం.

సుందరి, "లక్ష్మి అత్తయ్యా" అని జవాబు ఇచ్చింది.

"ఏ లక్ష్మి ?"

"పార్వతమ్మ పిన్నిగారి లక్ష్మి"

ఆ మాటవిని కాంతం గుమ్మంలోకి వచ్చి "ఎందుకే ఏడుస్తున్నావూ ?" అని అడిగింది ఆ పిల్లను.

లక్ష్మి మాట్లాడక ఏడుస్తూ ఊరుకొన్నది. సుందరి లక్ష్మిని దగ్గరకు తీసుకొని బుజ్జగిస్తే చివరకు అది ఇట్లా చెప్పింది. "మరిటా, రెండుజడలు వేసుకొంటే బాగుండదట ! అత్తయ్యా" అని బావురుమని ఏడ్చింది ఆ పిల్ల కాంతంవంక

దీనంగా చూస్తూ. ఆ చిన్నపిల్ల పడుతూ ఉన్న బాధానికి వేదన అంతా దాని రెండు కళ్ళల్లోనూ నుడికుండా కల్పించడం కాంతం కనిపెట్టింది.

కాంతం హృదయం ద్రవించిపోయింది. తల్లి ఆ పిల్లకు రెండు జడలూ వేయక ఒకేజడ వేయడం వల్ల, ఆ పసిదాని హృదయం ఎంత ఆరాటపడ్డదో, ఎంత వ్యధపొందిందో కాంతం నిమిషంలో గ్రహించి, బాధపడ్డది.

కాంతం మడిగట్టుకొన్నదల్లా ఏమీ సంకోచం లేకుండా దాన్ని కౌగలించుకొని ఒక్కసారి ఎత్తుకొని ముద్దాడి చలిస్తూ ఉన్న మధురకంఠంతో అన్నది "నాతల్లే, రెండుజడలూ వేసు కొంటే బాగుండదని ఎవరన్నా అన్నది." ఆ చిన్నబిడ్డకు ఎవరో అపకారం చేస్తుంటే, వాళ్లను శిక్షించడానికి తాను వేస్తున్నట్లు ఉన్నదికాని ఊరికే తెలుసుకోనేందుకు అడిగి నట్లుగా లేదు ఆ ప్రశ్న !

లక్ష్మమ్మ, తన బాధసంతా రెండు కళ్ళల్లోనూ మెరిపిస్తూ "అమ్మ" అన్నది, అంతకంటె ఎక్కువగా ఒక ముక్క అయినా చెప్పలేని వ్యథిత కంఠంతో.

"అమ్మో! అన్నదీ !" అని కాంతం ఆశ్చర్యాన్ని ప్రక టించి "నా తల్లే ! ఎందుకన్నదమ్మా అల్లాగూ ? అయినా మీ అమ్మకేం తెలుసునే ! నీకు రెండుజడలే బాగుంటాయమ్మా. పసిపిల్లలు రెండు జడలకాక ఒకజడ వేసుకొంటారు స్మ

ఎక్కడైనా! ఈ మాత్రం తెలియదేమే మీ అమ్మకూ!" అన్నది చాలా బాధను పొందుతూ.

ఇంతలో పార్వతమ్మవచ్చి కూతుర్ని ఉద్దేశించి "ఇక్కడున్నావుటే భడవా" అని, కాంతాన్నిజూచి "చూశావా వదినా దీని ఆగడం! రెండుజడలు వేయమని ఒక్క తీరాన పట్టుబట్టింది. పోనీ ఆ సంగతి మొదట అయినా చెప్పిందా! జడ వేయడం అంతాఅయిపోయిన తరువాత "ఈజడ వేశా వేమి! విప్పి, రెండుజడలు వెయ్యి" అని ఏడ్పు సాగించింది. దీనికి జడలు వేస్తూ కూర్చుంటే నాకు వంట ఎట్లా అవుతుంది వదినా! ఇదేమన్నా బాగుందేమో నీవేచెప్పు. వెయ్యనుపో అన్నాను చెప్పొద్దూ. ఆ పళ్లంగా అది ఏడుస్తూ నీ దగ్గరకు వచ్చింది. చూశావా దాని ఆగడం!" అని తప్పుఅంతా పిల్లదే అయినట్లు చెప్పి, ముక్కుమీద వేలేసుకొని చివరకు అన్నది "ఇంత చిన్నతనంలో ఇంత ఆగడం అయితే ఎట్లాగు వదినా!"

లక్ష్మి కాంతానికి దగ్గరగా జరిగి, తనకు అన్యాయం జరిగినట్లూ; అమ్మ తనపై అక్రమంగా నేరం మోపినట్లూ దీనంగా చూస్తూ, "రెండు జడలే వేస్తుంది అనుకొన్నాను అత్తయ్యా" అని కళ్ళనిండా నీళ్ళు పెట్టుకొన్నది.

ఈ చిన్నవిషయం ఆ బిడ్డకు ఎంత హృదయవేదన కలిగించిందో గ్రహించి కాంతం అశ్రుపూరిత నయనాలతో పార్వతమ్మవంక చూచి "చాల్లే, ఊరుకోవదినా, ఎవరు చెప్పారమ్మా నీకు చిన్నపిల్లకు ఒకజడ వేయమని! ఎవరైనా వేస్తారా? పైగా

చెప్పొచ్చావు! దాని మనస్సు గ్రహించలేకపోతివి. ఇకనీవు పో దానిసంగతి నేనుచూస్తాను" అని విదిలించి పంపించి వేసింది.

ఆ తరువాత కాంతం లక్ష్మిని ఒళ్ళో కూర్చోబెట్టుకొని, బుజ్జగిస్తూ, మంచిమాటలు చెపుతూ, చక్కగా రెండు జడలూ అల్లింది. అర్ధచంద్రాకారంగా చేమంతి పూలదండ అమర్చి, అటూ ఇటూ కుచ్చులువదిలి చిన్నపిల్లలకు వేస్తే రెండుజడలే వెయ్యాలనిపించేంత శిల్పం ప్రదర్శించి, చెక్కిళ్ళు దువ్వి, హృదయానికి హత్తుకొని ముద్దాడింది లక్ష్మిని. బొడ్డు మల్లెవలె విప్పారిన ఆ పసిదాని ముఖాన్ని చూచి కాంతం సంతృప్తితో అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందింది.

ఇక లక్ష్మి ఆనందానికి అవధిలేదు. దాని మొగము సూర్యోదయ సమయాన పంకజము పొందే వికాసాన్ని పొందింది. దాని హృదయము స్వాతిచినుకును స్వీకరించిన ముత్యపుచిప్ప అయినది. ఆ బిడ్డ హృదయంలో జనించిన ఆనందం పొంగి పైకి ఉబికి కమనీయములైన కపోలాలపైన నున్నపైన నుదుటిపైన చిరుగడ్డంపైన ప్రవహించి దొండపండు వంటి పెదవులపై నాట్యమాడి, చివరకు ఆ రెండుకళ్ళల్లోనూ మిలమిలా మెరసింది. ముఖమంతా కూడా కళకళ లాడి పోయింది.

ఆ చిన్నపిల్ల ఆనందానికేమోగాని కాంతం సంతోషాన్ని పొందటమే అతి విచిత్రమైన విషయము. ఆమె ఆ చిన్నబిడ్డను ఎత్తుకొని కాటుకకళ్ళతో కలకలలాడుతున్న దాని ముఖాన్ని

ముద్దెట్టుకొన్నది. ఆమె హృదయానందము ఝుంఝూమరుత్తా డిత సముద్ర తరంగముల యొక్క ఔన్నత్యాన్ని పొందింది. అమాయకమైన నిష్కళంకమైన ప్రేమ వాహినిలో ఆమె తల మునకలైంది.

విచిత్రమైన సంగతి ఏమిటీ అంటే, ఆ పసిదాని హృదయం కాంతానికే తెలిసింది. కాంతం హృదయగత సౌకుమార్యము ఆ పిల్లకే తెలిసింది. కంటకావృతమైన సుకుమార కుసుమంలోని మకరందాన్ని గ్రహించటం మధుపానికే తెలుసు! బాలికాహృదయగత వ్యథను తొలగించి ఆనందసుధను గ్రహించటం కాంతానికే తెలుసు!

ఆ చిన్న హృదయాన్ని సంతోషపెట్టడములోనే కాంతం మనుష్యత్వాన్నుంచి దైవత్వాన్ని అందుకొన్నది.

ఇటువంటి సందర్భాలలోనే పూర్వం పుష్పవర్షం కురిసేదట! దేవదుందుభులు మ్రోగేవట! ఇప్పుడూ దుందుభులు మ్రోగుతూనే ఉన్నవి. పుష్పవర్షం కురుస్తూనే ఉన్నది. మానవుడు పాపకలుషితుడు అయిపోయినాడు కాబట్టి అవి వినేశక్తి కనేశక్తి కోల్పోయినాడు అనేవాళ్లూ ఉన్నారు.

ఈ చిన్నపిల్ల ఆనందాన్ని చూచి ప్రకృతి అంతాకూడా చలించిపోయింది. గాలిదేవుడు సంతోషం పట్టలేక గంతులు వేశాడు. పసిదాని ముంగురులను మృదువుగా స్పృశించి ముద్దెట్టుకొన్నాడు. మానవివృక్షుల ప్రశంస లేకుండా కోయిల గొంతు సవరించుకొని కుహు, కుహూమన్నది. వసంతవేళా

వికసితశక్తిని పునరుజ్జీవింప జేసుకొని చేమంతి హేమంతంలో పూసింది.

తన రెండుజడల సౌందర్యాన్ని తల్లికి చూపటానికి లక్ష్మి గంతులేసుకుంటూ లేగదూడలాగ పరుగెత్తింది. లక్ష్మి అటు వెళ్ళిపోవడంతోనే పార్వతమ్మ చిన్నకొడుకు అత్తయ్యా అంటూ వచ్చాడు. వాడు చాలా తెలివిగలవాడు. దొరలాగ నడుస్తాడనీ పెద్ద అయిన తరువాత వాడు డి. యస్. పి. ఉద్యోగం చేస్తాడని వాళ్ళ అమ్మ నమ్మకం.

వాడు ఇప్పుడు కొత్త బుష్‌కోటు ఒకటి కుట్టించుకొన్నాడు. దాన్ని అత్తయ్యకు చూపించటానికే వాడువచ్చింది. పరుగెత్తుకుంటూవచ్చి అత్తయ్యకాళ్ళకు చుట్టేసుకొని వికసించిన ముఖంతో "చూడు అత్తయ్యా" అంటూ తన కోటు వంక కళ్ళు తిప్పాడు. ఆ పసివాడు ఏమంటున్నాడో కాంతం గ్రహించింది.

"మా నాయనే. కొత్తకోటు కుట్టించుకొన్నావా! బాగుందిరా నాయనా. ఎవరు కుట్టించారురా? ఇంత చక్కని కోటు ఎవరు కుట్టించారురా నీకూ! అమ్మో! అమ్మ మంచిదిరా నాయనా" అంటూ కాంతం వాడిని ఎత్తుకొని ముద్దాడింది. అంత అందమైనకోటు ఎప్పుడూ చూడనట్లు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ "ఎక్కడిదిరా ఈ కోటూ! ఇంతబాగుంది ఇదెక్కడి కోటురా" అని మళ్ళీ మళ్ళీ అన్నది. అల్లాగ తాను చాలాసార్లు

అనకపోతే వాడు సంతోషించడని కాంతానికి బాగా తెలును. అందుకనే ఆమె ఆ కోటును అంత ఎక్కువగా మెచ్చుకొన్నది.

కృష్ణుడు సంతోషించాడు. చిన్నవాడైనా ఏదో తృప్తి, ఏదో మధురభావము వాడి కనీనికలలో ప్రకాశించింది. ఈ కాంతం అన్న తీయనిమాటలు, ఆ క్షణాన్నేగాక వాడి జీవితాన్నంతా మధురాతిమధురం చేసిందని నా ఊహ. ఒక్క మధురమైన వాక్కుకు సుహృద్భావ సంజనితమైన ఒక్క తియ్యని పలుకుకు జీవితప్రయాణానికి అంతా సరిపోయే పాథేయాన్ని ఇయ్యగలశక్తి ఉంటుంది.

కాంతం కృష్ణుణ్ణి ముద్దాడి పంపించింది. వాడు ఠీవిగా నడుస్తూ ఉంటే వాడిమీదే కళ్ళు నిలిపి చూచి ఆనందిస్తూ "వాడి ఠీవి ఎవరికి ఉందట్టా నిజంమాటకొస్తే! దొర! దొరే!" అని తనలోతాను అనుకొన్నది.

కాంతం కృష్ణుణ్ణి పంపించి, పరితృప్తిని పొందిన హృదయంతో వంటయింట్లోకిపోయి కోడలును పిలిచి "కోడలా, మీ మామగారికి కాఫీ యిచ్చారా అమ్మా మరోసారి. వంట అలస్యం అయ్యేలాగుంది" అని చెప్పింది.

౨

కోడలు వీధిగదిలోకి వెళ్ళి మామగారిని పిలవకుండానే మళ్ళీ పరుగెత్తుకొంటూ తిరిగివచ్చి "అత్తయ్యా వాకిటిముందు బండి ఆగింది. ఎవరో బంధువులు వస్తున్నారు" అని సంతోషంతో పొంగిపోతూ చెప్పింది.

"నేను చెప్పలేదుటే, కోడలా, ఎవరో వస్తారని! పొయ్యి ఊదినప్పుడే అనుకొన్నాను! ఎవరే వచ్చిందీ? చూచి రాకపోయినావా?" అంటూ ఆదరాబాదరా కాంతం వీధి గుమ్మంలోకి వచ్చింది. సుందరికూడా అత్తగారి వెనకాలే వెళ్లింది. ఇంతలోకి బండిలోనుంచి జయా పిల్లలూ దిగారు.

"వదిన వచ్చింది అత్తయ్యా" అంటూ సుందరి పరుగెత్తుకుంటూ ఆడబిడ్డకు ఎదురుగా వెళ్ళి చేతిలోఉన్న పాలడబ్బా, సీసా తీసుకొన్నది. జయ పసివాణ్ణి ఎత్తుకొని గుమ్మంవైపు నడిచింది. సుందరి పెద్దశేషును ఎత్తుకొని వెనకాలే వచ్చింది. కాంతం కొడుకుకూతుర్ని చిన్నశేషు అనీ, జయ కూతుర్ని పెద్దశేషు అనీ పిలుస్తుంది. బండివాడు సామానంతా తీసుకొచ్చి హాలులో పెట్టి వెళ్ళిపోయినాడు. 92 60 68

"పాపా, ఈబండికే వచ్చావాతల్లీ. ఒక్కదానివే వచ్చావేమే అమ్మాయ్! అల్లుడు రాలేదేమే! వచ్చేదానివి ముందుగా ఉత్తరం వ్రాసుకోరుటే తల్లీ! అన్నయ్యా స్టేషనుకన్నా వచ్చేవాడుగా!" అంటూ ఎఱ్ఱనీళ్ళు తీసికొచ్చి పిల్లవాడిచుట్టూ ముమ్మారుతిప్పి దూరంగా వీధిలో పారపోసివచ్చి కాళ్ళూచేతులూ కడుక్కొని ముద్దాడుతూ కూర్చున్నది కాంతం.

పెద్దశేషు అమ్మమ్మ పోతానంటూ సుందరి చేతుల్లోంచి జారి పరుగెత్తుకుంటూవెళ్ళి అమ్మమ్మ మెడచుట్టూ చేతులు

వేసి పీపున్పైన తల ఆనించి అనిర్వాచనీయమైన అందాన్ని పొందుతున్న దానివలె నిమీలితనేత్రి అయింది.

కాంతం పెద్దశేషుని కౌగిలిలోకి తీసికొని ముద్దాడి ప్రక్కన కూర్చోబెట్టుకొని, పిల్లవాణ్ణి ఉద్దేశించి జయతో "రవి కులాసాగా ఉన్నాడా తల్లీ! అత్తా, తాత అంటున్నా డుటే, రోజూ నీళ్లుపోస్తున్నావా?" అని పెయ్యిప్రశ్నలు అడిగిందన్న మాటేకాని ఒక్కదానికీ సమాధానం వినిపించుకోదు. పిల్లవాణ్ణి తన హృదయానికి హత్తుకొన్నది. శేషుడు దగ్గరగా లాక్కొని ముద్దాడింది. "అమ్మాయ్ పాపా; శేషు సరిగ్గా అన్నం తింటున్నడా, దీనికి తలంటిపోసి ఎన్నాళ్లయిందే! ఇట్లా గేనా పిల్లలను పెంచుకోటం" అని కోప్పడ్డది., "ఏమండోయ్" అని ముసలాయనను కేకవేసింది. ఇల్లాగ ఉక్కిరిబిక్కిరి అయి పోయింది.

"అన్నయ్య ఇంట్లో లేడా వదినా?" అని అడిగింది జయ. "భోజనంచేసి ఆయన ఆఫీసుకు వెళ్ళాడుగా వదినా!" అన్నది సుందరి.

ఇంతలో ముసలాయనవచ్చి, కూతురుకు క్షేమ సమా చారమూ అదీ అడిగి పిల్లలను ఒక్కసారి ఎత్తుకొని, ముద్దాడి, సంతోషించి వెళ్ళిపోయినాడు.

కాంతం వీణ్ణి ముద్దాడనూ, దాన్ని ముద్దాడనూ, కూతురును క్షేమ సమాచారం అడగనూ, అల్లుని సంగతి అడగనూ, ఇల్లాగ తికమకలై పోతున్నది. ఈ సంతోషంలో

ముసలాయన అంతవరకు భోజనం చెయ్యలేదన్న సంగతి జ్ఞాపకంరాలేదు. మనుమణ్ణిదించి మనుమరాలును ఎత్తుకోనూ మనుమరాలినిదించి మనుమణ్ణి ఎత్తుకోనూ! ఈ హడావిడిలో ఆమెకు ఏ సంగతీ జ్ఞాపకం రాలేదు.

ఇప్పుడు అతి విచిత్రమైనదీ, హృదయాన్ని కదిలించేదీ అయిన ఒక సన్నివేశము జరిగింది. అంతవరకూ వీధివాకిట్లో ఇసుకతో ఆడుకొంటూఉన్న చిన్న శేషు ఎప్పుడు వచ్చిందో ఏమో వచ్చి కాంతానికి ఎదురుగా నుంచున్నది. ఆ సంగతి ఎవరూ గమనించలేదు.

కొంచెంసేపు అట్లాగే నిలుచున్నది. తన బామ్మ ఎంతసేపూ పెద్దశేషునూ, రవినీ ముద్దాడటం చూచింది. తనను వదిలివేశారనీ, తనసంగతి ఎవ్వరూ చూడడము లేదనీ, దానికితోచి మనస్సు కష్టపెట్టుకొన్నది. అది ఒకమూలకు ఒత్తిగిల్లి ముఖం ఇంతజేసికొని గోడవైపు ముఖంత్రిప్పి కళ్ళనిండా నీళ్ళు పెట్టుకొంది.

కాంతం హృదయానికి ముల్లుగుచ్చుకొన్నట్లు బాధకలిగింది. "నాతల్లే నిన్ను ఎత్తుకొనలేదనేనా ఆ కోపం! మా అమ్మకదూ రా అమ్మా" అన్నది.

చిన్నశేషు మాట్లాడనూలేదు, ఇటు తిరగనూలేదు. తల్లి ఎత్తుకొనబోతే రానని ముడుచుకొనిపోయి గోడకు అతుక్కుపోయింది. తల్లికి ఏంజేయటానికి తోచక అత్తగారి వంక చూచింది. జయమ్మకు నవ్వొచ్చింది.

కాంతం హృదయం కొట్టుకొన్నది. చేతిలోవున్న రవిని తల్లికిచ్చి ఒళ్ళోకూర్చున్న పెద్దశేషును పక్కకు జరిపి, దిగ్గున లేచి చిన్న శేషును ఎత్తుకోబోయింది. దానికి ఎంత కష్టంగా ఉందో మనస్సు, అక్కడనుంచి రానని పెనుగులాడింది. "నాతల్లే, చచ్చిపోయినానే. నీమనస్సు కష్టపెట్టానే తల్లీ. రా అమ్మ" అంటూ బుజ్జగించి చేతుల్లోకి తీసుకొని బుజాన వేసుకొంది.

శేషు బాఅమ్మ శరీరానికి అతుక్కుపోయింది. ఆ శరీరంలో శరీరమాయె! రక్తంలో రక్తమాయె! ఆ చిన్న హృదయంలోని తహతహలు ఈ పెద్దగుండెలో ప్రతిధ్వనిస్తూ ఉండె! కాంతం కళ్ళల్లోకి జాలీ, ప్రేమా, అనుకంపా ఉబికి ఉబికి వస్తున్నవి.

తనకు నిరాదరణ జరిగిందని అనుకొని నీరైపోతున్న మనుమరాలును హృదయానికిహత్తుకొని చేలాంచలము దానిపై కప్పి "నాతల్లే, నా బంగారుతల్లే ఎందుకు ఎత్తుకోనే తల్లీ" అని ఏమేమో అనడము సాగించింది. క్షణంలో జరిగింది ఇదంతా.

ఆ చిన్నిబిడ్డ సుతిమెత్తని శరీరావయవములు పరిష్వంగ మాత్రముచేత నలిగి ఎఱ్ఱబడి రాగచ్ఛటా దీప్తములై మనోహరమైనవి. పునఃపునః కృత గాఢాలింగనాలచేత, చిన్ని శేషు పరితృప్తిని పొందినదై కృతజ్ఞతా మధురాపాంగయై బాఅమ్మ భుజాన్ని గట్టిగా కరుచుకొన్నది. కాంతం తనువు పులకించింది. ఆమె ఆత్మలో కామధేనువు ... మోధారలు పితికినట్లు అయినది.

ఒళ్ళో కూర్చున్న తనను జరిపి క్రింద కూర్చోబెట్టి చిన్న శేషును ఎత్తుకొన్నదని పెద్దశేషుకు కోపంవచ్చింది. అవమానంతో క్రుంగిపోయింది. ఇప్పుడు దానివంతు. అది వెళ్ళి ఒక మూలనునక్కి బిక్కముఖంపెట్టి అశ్రుపూరిత నయనాలతో, "నన్ను ఎత్తుకోవా అమ్మమ్మా! నీకు ఆ మనుమరాలే ఎక్కువ అయిందా ఏమిటి! రోజూ దాన్ని ఎత్తుకొంటూనే ఉంటివిగా! నేను ఇవ్వాళేగా వచ్చింది!" అన్నట్లు జాలిగా చూచింది.

జయ దాన్ని ఎత్తుకోబోతే రానని పెనుగులాడింది. చిన్నదానికంటె రెండు ఆకులు ఎక్కువే చదివింది ఇది. అమ్మమ్మవచ్చి ఎత్తుకొంటాను రావే అన్నదాకా ఉండక హంసలాగ నడిచిపోయి తనచిన్న చేతులతో అమ్మమ్మకాళ్లను చుట్టేసుకొన్నది ఎత్తుకోమని! చంకలో చిన్న శేషు, కాళ్ళను చుట్టేసుకొని పెద్ద శేషు !

ఏమిచేయాలో కాంతానికి తోచలేదు. ఆమెహృదయం ఆనందంతో నిండిపోయింది. ఆ ఆనందపుపొంగు స్వర్గపుటంచులను తాకినది. ఆమెకు స్వర్గసోపానాలను ఎక్కుతున్నట్లుగా తోచింది.

తనను ఎక్కడ దింపేస్తుందోనని చిన్న శేషు, బాఅమ్మ మెడను గట్టిగా కౌగలించుకొన్నది. కాళ్ళకు అతుక్కొనిపోయి, కళ్ళనిండా నీళ్ళు పెట్టుకొని చేతులు రెండూ ఎత్తింది పెద్ద శేషు.

బా అమ్మ నాది!

అమ్మమ్మ నాది!

రెండు వీణలు మధుర స్వరాలు పలుకుతున్నవి. ఇద్దరూ వేడుస్తున్నారు.

ఏం. జెయ్యాలె!

బుజంమీద పిల్లను తీసుకొందామని కోడలూ కాళ్లను పట్టుకొని వ్రేలాడుతున్న పిల్లను తీసికొందామని కూతురూ వచ్చి కాంతానికి కుడి ఎడమల నుంచున్నారు. ఎవ్వరూ కాంతాన్ని వదలరే!

ఆరిబాబా ఎట్లా ఈ సమస్యను పరిష్కరించటం! ఏమి చెయ్యాలె! కోడలూ కూతురూకూడా ఏమి చెయ్యటానికీ తోచక బిక్కముఖాలతో నవ్వుతూ నుంచున్నారు !

నేను పుట్టినరోజు ఇవ్వాళ నా యింటికి రమ్మని సత్యా, నేను మెట్టినరోజు ఇది, నా యింటికి రమ్మని రుక్మిణీ ఆ కృష్ణ భగవానుణ్ణి చెరిఒక వైపునకు లాగిన సన్నివేశమే మాధుర్యం లోనూ, మధురభావ నిర్వహణలోనూ దీనికి సదృశమైన సన్నివేశం.

కాంతం ఆనందానికి అవధిలేదు. ఆనంద బాష్పాలు ఆమె కన్నులలో తొణికిస లాడినవి.

ఏమీ తోచక చివరకు కాంతం, ఇద్దరినీ చెరియొక చంకనా ఎక్కించుకొని మందహాసం చేసింది. దానితో పిల్లలిద్దరికీ తృప్తి కలిగింది.

ఒకక్షణం అయిన తరువాత ఇద్దరూ చంక దిగారు. "ఆడుకొందాము రావే, చిన్న శేషూ" అన్నది పెద్దది. "సరే. రా" ఆడుకొందాము అన్నది చిన్న శేషు. నిమిషంలోకి వదినా మరదళ్ళిద్దరికీ సమాధానం కుదిరింది. పకపకా నవ్వుకొంటూ హాలులోకి వెళ్ళిపోయినారు వాళ్ళు.

కాంతం పరితృప్తితో ఆనందంతో పొంగిపోతూ, భగవంతునికి నమస్కరించి "నాకు వేరేస్వర్గం అక్కరలేదు మహాప్రభూ. ఎంత దయామయుడవో నీవు స్వర్గాన్నే భూమిమీదకు తీసుకొని వచ్చావు!" అనుకొన్నది. అనుకొని నవ్వుకొన్నది.

* * *

"అయ్యో నన్ను తగలెయ్య. నామతి ఇల్లాగ తగలడి పోతున్నదేమే, కోడలా నీవన్నా చెప్పొద్దుటే మామగారికి భోజనానికి ఆలస్యం అవుతున్నదని! అయ్యో! అయ్యో! ఆమాత్రం తెలిస్తే ఇంకా అనుకోవలసింది ఏముంది. ఇటువంటి దానివి దొరకావేమే! పిల్ల వచ్చిందని సంతోషంతో నేనేదో కాస్త మతి మరుపులో పడిపోయానుగదా, నీకన్నా తెలియొద్దుటే పిల్లా? అది సరేగాని కోడలా, రేపు నేను కాశీకి వెళ్ళిపోతే, ఆయన సంగతి ఏంగాను? అన్నది కాంతం, ఏదో చటుక్కున జ్ఞాపకము వచ్చినట్లు.

"అందుకనే, కాశీ వద్దు, గోద గడ్డలూ వద్దు. ఇక ఆమాట ఎత్తకండి. ఇదే కాశీ, ఇదే రామేశ్వరం మీకు" అన్నది సుందరి.

"అట్లా అనకే పిల్లా. నేను ఎట్లాగూ కాశీకి వెళ్ళేదాన్నే. ఈ సంగతి కాస్త జ్ఞాపకం ఉంచుకొని తొందరగా నాలుగు సంగతులూ అవగాహన చేసుకో ఏది ఎట్లాగ చెయ్యాలిసిందీ, ముఖ్యంగా మామగారిని ఎట్లా చూడాలిసిందీను. సంగతులు నాలుగూ నీకు తెలిసిన తరువాత నేను క్షణంకూడ ఉండను. తెలిసిందా" అన్నది కాంతం.

సుందరి ఏమీ మాట్లాడక ఊరుకొన్నది. ఇంతలో కాంతం తెప్పరిల్లి, "సరేగాని అల్లాగచూస్తూ ఉంటావేమే, పోయి మామగారిని మడి కట్టుకోమని చెప్పు." అని కోప్పడ్డది.

కాంతం అందరికీ వడ్డించింది. ముసలాయన కూతురుతోనూ, మనుమరాళ్ళతోనూ, కబుర్లు చెప్పుకుంటూ సంతోషంగా భోజనంచేసి వెళ్ళి పడుకొన్నాడు.

ఆ తరువాత కాంతం తనకూ కోడలుకూ వడ్డించుకొన్నది. సరసాలు ఆడుకుంటూ నవ్వుకుంటూ భోజనాలు చేశారు. ఆడవాళ్ల భోజనాలు పూర్తి అయ్యేసరికి సరిగ్గా పన్నెండు వేశారు.

భోజనాలు అవుతున్నపుడు జరిగిన సంభాషణ అంతా చాలవరకు కాంతం కాశీకి వెళ్ళిపోవటాన్ని గురించే. కోడలు మనవణ్ణి కనేట్టూ, ఆ వంశోద్ధారకుణ్ణి చూచి కాంతం కాశీకి వెళ్ళిపోయేటట్టూ ఒప్పందాలు జరిగినవి. "మీకు లేనప్పుడు ముసలాయనకు మహారాజులాగ చూచేభారం నాది" అని కోడలుచేత అనిపించిగాని కాంతం కడుపునిండా తినలేదు.

## ౮

భోజనానంతరం కాంతం ఒకగంట నిద్రపోయింది. తాను కాశీలో మణికర్ణికా ఘట్టంలో స్నానం చేస్తున్నట్లూ ఆ తరువాత ఆ విశ్వేశ్వరుని దర్శనం చేసినట్లూ కలవచ్చింది. విశ్వేశ్వరుని సన్నిధిలో ఉన్నప్పుడే ఆయన పిలిచాడుట. భర్త గొంతుక గుర్తుపట్టి వెళ్ళుదాము అని అనుకొనేసరికి మెళకువ వచ్చిందట.

ఇంతలో గదిలో తనకోడలూ, కూతురూ ఏదో పెద్దగా మాట్లాడుకోవటం కాంతానికి వినిపించింది.

"ఏమోనమ్మా నాకు ఈ గొడవలు తెలియవు. అత్తగారిమాటే వినాలో నీమాటే వినాలో నాకు తెలియకుండా ఉన్నది" అని సుందరి విసుక్కున్నది.

కాంతం అడిగింది "ఏమిటే కోడలు పిల్లా ఆ రుసరుసలూ?" అని.

"ఏంలేదు అత్తయ్యా"

"ఏమీ లేకపోవటం ఏమిటి వదినా, చెప్పరాదూ నీవన్నమాటలు" అని జయ అన్నది.

"నీవేచెప్పు వదినా నాకేమీ భయంలేదు"

"నీకు భయము లేనిమాట ఎట్లాగూ నిజమే. భయమున్నదానివైతే అట్లా మాట్లాడనే మాట్లాడవు!"

వదినా మరదళ్ళకు ఏదో కీచులాట వచ్చిందని కాంతం గ్రహించి "ఏమిటేతల్లీ వదినతో పోట్లాడావా?" అని అడిగింది.

"పోట్లాట ఏముంది లే !" అన్నది జయ.

"పోట్లాట కాకపోవడము ఏమిటి?" అని ఈసడించింది సుందరి.

"ఏమిటే అసలు సంగతి నీవన్నా చెప్పవే అమ్మాయ్" అని కూతురును అడిగింది కాంతం.

"ఏమిటంటే అమ్మా, రవిగాడికి రెండో యేడువచ్చిందా! రేపు వదిన ఆడపిల్లను కంటే సంబంధం కలుపుకోవచ్చును. అంచక్కా మేనత్త మేనమామ బిడ్డలు, చిలకా గోరంకుల్లాగ ఉంటారని నేను అన్నానే! పోనీ సరే అనకూడదుటే వదిన! ఆ మొగారి నోటిముత్యాలేమన్నా రాలిపోతయ్యా? ఏమన్నదో తెలుసునా! నాకు కూతురే పుడితే ఇయ్యక ఇయ్యక నీ కొడుక్కే ఇయ్యాలా! ఆ నల్లనివాడికి ఎవరిస్తారు అన్నదే! నా కొడుకు నల్లగా ఉన్నాడట! వాడికి ఇయ్యాదట! ఇదే మన్నా బాగుందిటే! నా కొడుక్కు ఇయ్యాలిసి వస్తుందని అసలు కూతుర్నే కనదట! తనకు కొడుకే పుడతాడట! ఆ సంగతి విన్నావా! తాను పిల్లను ఇయ్యకపోతే నా కొడుక్కు పెళ్ళే కాదనుకొంది కామాలు వదిన!"

"నీ కొడుక్కు పెళ్ళి కాదని నేను అన్నానా వదినా?" అని గట్టిగా అడిగింది సుందరి.

"వేరే అనాలేనా ఏమిటి! నాకు కొడుకే పుడతాడని నీవు అనలేదూ?"

"అత్తగారు అన్నది వదినా నాకు కొడుకే పుడతాడని! వారిమాట ఎప్పుడన్నా కాకుండా పోయిందా ఏమిటి! అదీ కాక నాణ్ణిచూచి తాను కాశీకి వెళ్ళిపోవాలని చూస్తున్నదామె!" అన్నది సుందరి ఈ విషయంలో తన తప్పు ఏమీ లేనట్లు!

ఈ మాటమీద జయ, "పోనీ లేవదినా కొడుకునే కను. ఎవరొద్దన్నారు. మా రవికి పెళ్ళాం ఎక్కడో పుట్టేఉంది!" అని దీర్ఘాలు తీసింది.

సుందరి కుహనా కోప సూచకమైన వదనం పెట్టి "విన్నారా అత్తయ్యా నా పిల్లను చేసుకోనవేగా దాని అర్థం" అన్నది గునుస్తూ.

"ఆ అర్థం ఎక్కడుంది వదినా! నీవు కొడుకునే కంటానని పట్టుబట్టావు కాబట్టి నేను అల్లాగు అన్నాను. పోనిద్దూ! ఎందుకొచ్చిన రగడ. కొడుకునే కను. నా కొడుక్కు ఎక్కడో దొరక్కపోదు పెళ్ళాము"

"అది వీల్లేదే జయా! ఇప్పుడే చెప్తున్నాను, నేనున్నా లేకపోయినా ఈ మాటమాత్రం జ్ఞాపకం ఉంచుకో. దాని కూతురును నీ కొడుక్కి చేసికోక తప్పదు" అని కచ్చితంగా చెప్పింది కాంతం.

"ఏదీ, వదినకు పుట్టబోయేది కొడుకేగా ?" అని గుని సింది జయ.

అయితే ఏంలేవే అమ్మాయ్. ఈ తఢా కొడుకేఅనుకో. దాని తరువాత చక్కని కూతుర్ని కని నీకు ఇయ్యకూడదా!"

"ఏంవదినా. పోనీ - ఆ వాగ్దానం అన్నా చెయ్యి సంతో షిస్తాను."

"నేను కాదన్నానా వదినా ! ఏదో నవ్వులాటలకు రవి నల్లనివాడు అంటే నీవు ఊరికే ఇది అయినావుగాని !"

"అదుగో మళ్ళీ ఆ మాటే అంటావేం వదినా, రవి నల్లనివాడా ? ఎవరైనా అన్నారా, నీవే అంటున్నావా ?" అంటూ జయ పిల్లవాణ్ణి హృదయానికి గట్టిగా అదుము కొన్నది.

సుందరి అంతటితో ఊరుకోక "నేనైతే నీ కొడుక్కు నా పిల్లను ఇయ్యటానికి ఇష్టపడతానే అనుకో. ఆ పుట్టేది ఏమంటుందో ! ఈ నల్లబావను నేను చేసుకోను అంటే, అప్పు డేంజేస్తావు వదినా ? ఆ సంగతి కాస్త ఆలోచించుకో" అన్నది.

జయ కోపాన్ని నటిస్తూ "అడగనియ్యి ఆ భడవాను ! అడిగితే నీ అమ్మ ఎట్లాచేసుకొన్నదే మా అన్నయ్యనూ; అని సాగదీసి అడగనా ఏమిటి వదినా ?" అని సాభిప్రాయంగా హస్తచాలనం చేసింది.

ఆ తరువాత "మీా అన్నయ్య రవి అంతనలుపా ?" అని సుందరి ఆశ్చర్యాన్ని ప్రకటించడమూ, రవే కాస్తనయం

మా అన్నయ్యే నలుపు అని జయ కచ్చితంగా చెప్పటమూ జరిగింది.

రవి నలుపా, రవి మేనమామ నలుపా అన్న విషయాన్ని గురించి వాదోపవాదాలు జరిగినవి వదినా మరదళ్ళ మధ్య. ఇంతలోకి కాంతంవచ్చి కూతురూ కోడలూ మధ్య రాజీ కుదిర్చింది. జయ, రవిగాడికి బాగా నలుగుపెట్టి నలుపు విరగ కొట్టేటట్లున్నూ, సుందరి మూడవకాన్పుకు పుట్టబోయే పిల్లను, ఏ ఆటంకమూ పెట్టకుండా సంతోషంగా రవికి ఇచ్చేటట్లున్నూ ఒప్పందాలు జరిగినవి.

ఇంతలో ప్రొద్దుగూక వచ్చింది. కాంతం ఇద్దరు మనుమరాళ్ళకూ జడలువేసి పూలుపెట్టింది. సుందరికి, జయ జడవేసి ఒక ప్రత్యేక పద్ధతిని మనోహరమైన రచన చేసింది. అంతా పూర్తి అయిన తరువాత జయ వదినగారి వీపుపై చరచి "పో వదినా, పోయి తెల్లచీరె కట్టుకో" అన్నది. సుందరి "ఊరుకో వదినా, పూలు నలిగిపోతవి" అన్నది. జయ ఎంతో ఆశ్చర్యపడిన దానివలె చూస్తూ. "పూలు నలిగిపోకుండా ఎంతసేపు ఉంటావో అదీ చూస్తాగా!" అని పక పక నవ్వింది. మన్మథ ధనుర్విముక్త యశోక ప్రసూనములాగ ధగధగ మెరసిపోయింది సుందరి.



జయమ్మ విలాస సుందరి. సౌందర్య సీమలను రచియించటంలో ఆరితేరిన చెయ్యి. వదినగారి గదిలోకి వెళ్ళి

శయ్యా గృహాలంకారానికై పూనుకొన్నది. ఆ మూలనున్న టేబిల్ ఈమూల పెట్టి దానిపైన ఒక అందమైన వేజులో ముద్ద గన్నేరులు ఉంచింది. గుత్తులు గుత్తులుగా ఉన్న ఆ గన్నేరులు ఎంతో మనోహరంగా ఉన్నవి. మరో బల్లపైన పూలు కుట్టిన రుమాలును పరచి దానిపై తన అన్న చదువుతున్న రెండు మూడు పుస్తకాలను అమర్చింది. గది వాకిలికి జరీపూలుగల తెర ఒకటి అమర్చింది. ఆ గదికి రెండు కిటికీలున్నవి. జయ తాను స్వయంగా కుట్టితెచ్చిన తెరలు ఆ కిటికీలకు కట్టింది. గది అంతా కూడా ఇట్లాంటి చిన్న చిన్న మార్పులతో, మనోహరంగా ఉండేలాగున చేసింది.

ఆ గదిలో ఒక పెద్ద పట్టెమంచము ఉన్నది. అది తన అన్న పడుకునేది. అదిగాక మరియొక చిన్న పట్టెమంచం ఉన్నది. అది తన వదినగారిది. ఈ రెండు పట్టెమంచాలపైన ఉన్న దుప్పట్లు కొద్దిగా మాసిఉన్నయి. జయ ఆ రెండింటిని తీసివేసి తల్లిని అడిగి రెండు తెల్లని దుప్పట్లుతెచ్చి వాటిపై పరచి ముడుతలు లేకుండా సర్దింది. "వదినా రెండు పక్కలూ వేశాను. సుఖంగా నిద్రపో" అన్నది. "నిద్ర బాగానే పడుతుంది వదినా" అని సుందరి ముసిముసి నవ్వులు నవ్వింది.

ఈమధ్య రెండు నెలలనుంచీ సుందరి వికారంతో బాధ పడి మంచిపక్క వేసుకొన్నా పాపాన పోలేదు. ఇవ్వాళ మెత్తని పరుపుపై పడుకొని నిద్రపోవాలని నిశ్చయించుకొన్నది. ప్రొద్దు గూకే సమయానికి రఘు వచ్చాడు. సుందరి ఎదురుగా నుంచు న్నది. ఆమె ముగ్ధ మధురవదన సరోజాన్ని చూచి రఘు నిలు

చున్న చోట నిలుచున్నట్లే ముగ్ధుడైపోయినాడు. గది అంతా కలయచూశాడు. మన్మథుడు గది నాల్గుమూలలా పరవళ్ళు తొక్కుతున్నట్లుంది. ముఖ్యంగా సుగంధ పరిశోభితమైన ఆ శయ్యనూ ఇతర అలంకారాలనూ చూచి ఆశ్చర్య చకితుడై "ఏమిటిది? ఇంత అంగంగా అలంకరించావు?" అన్నాడు నవ్వుకొంటూ. సుందరి పారిజాతకుసుమ రమ్యమైన తన కేశ బంధాన్ని సవరించుకొంటూ, మధుర లజ్జావిహిత మూర్తియై వంచినతల వంచినట్లే ఉంచి "నేనుకాదు ఈ అలంకారాలన్నీ చేసింది. మీ చెల్లెలు వచ్చింది. వదినే ఈ ఏర్పాట్లు అన్నీ చేసింది" అన్నది. ఏదో కృతజ్ఞతాభావము ఆమె ముఖంలో ప్రకాశించింది.

"మా చెల్లెలు వచ్చిందా, ఏదీ!" అంటూ రఘు దొడ్డివైపు వసారాలోకిపోయి "ఎప్పుడొచ్చావే పాపా, బావరా లేదా?" అని పలుకరించి క్షేమసమాచారాలు అడిగి పిల్లలను ముద్దాడాడు. అ తరువాత కూర్చుని ఆ సంగతులూ ఈసంగతులూ మాట్లాడి చివరకు కూతురునూ మేనకోడలునూ తీసికొని పార్కువైపుకు షికారు వెళ్ళాడు. 'నాన్నా' అని కూతురూ 'మామయ్యా' అని మేనకోడలూ రఘూను వేయి అడుగుతూ ఉంటే వాటికన్నిటికీ సమాధానాలు చెపుతూ వాళ్ళను ముద్దాడుతూ, పూలచెట్లనూ వాటినీ చూపిస్తూ కాలంగడిపి ఇంటికివచ్చి భోజనంచేసి వెన్నెలలో పిల్లలతో మాట్లాడుతూ పడుకొన్నాడు.

వెన్నెల మనోహరంగా ఉంది. కల్పవృక్షాలు విరియ పూసి జలజలా పుష్పాలను రాలుస్తున్నాయేమో! లేక స్వైరవిహారంచేస్తున్న అప్సరోంగనలు నవ్వులు వొలకబోస్తున్నారో! కాకుంటే వెన్నెల కింత ఆహ్లాదజనకత్వం ఎలావస్తుంది?

ముసలాయనా, కాంతం, జయా, అందరూ మంచాలపై కూర్చుని కబుర్లు చెప్పుకొన్నారు. పెద్దశేషు వెంటనే నిద్రపోయింది. చిన్నశేషు మాత్రం నిద్రపోక మేకులాగ అల్లాగే కూర్చున్నది. ఎంతసేపటికీ నిద్రపోదు. కాంతం కాసేపు ఎత్తుకొని తిరిగి చివరకు ముసలాయనకిచ్చి "దీన్ని కాస్త నిద్రపుచ్చండి" అన్నది.

పిల్లను బుజంమీద పడుకోబెట్టుకొని ఎంతసేపు చిచ్చికొట్టినా అది నిద్రపోక పోవడంవల్ల ముసలిబాబు చిచ్చి కొడుతూనే పచార్లుచేస్తూ పాడటం సాగించాడు. ఆనందభైరవి, ధన్యాసి, నాదనామక్రియ, నాట, కల్యాణి, కాంభోజి మొదలైన రాగాలన్నీ కలిసి మెలివడి, ఆయన గొంతులోకి తోసుకు తోసుకువచ్చి పడ్డవి. ఆయన ఆనందంతో పాట విజృంభిస్తున్నాడు. ఆ ఆనందానికి మేరలేదు. ముసలాయన క్షీర పాథోధి వినిర్గమచ్చంద్రబింబ దర్శనమైన చకోరమైపోయినాడు. ఏవో పాటలు పాడుతున్నాడు. రాగాలు అతని గొంతుకలో నలిగిపోతున్నయి. ఆయన హృదయం అమృత భాండం కుమ్మరించినట్లుగా ఉండి. ఒళ్లు తెలియని సంతోషంతో పాడుతూ ఉంటే, కాంతం, జయ, సుందరి, అంతా నవ్వును అణచుకొ

న్నారు. వాళ్ళకేం తెలుసు ఆ ముసలి గొంతుకలో ఉండే మాధుర్యం! వెన్నెలలో అమృతం ఉందని చకోరానికే తెలుసు! తాత ముసలి గొంతుకలో మాధుర్యం ఉందని ఆ మనుమరాలికే తెలుసు! ఎటువంటి కంఠాన్ని అయినా మధుర కంఠంగానే భావించి ఆనందించగలశక్తి ఇద్దరికే ఉంది ఈ ప్రపంచంలో. దంపతులు యౌవనంలో ఉన్నప్పుడు ముగ్ధయైన స్త్రీయకు భర్తయొక్క అశిక్షిత కంఠస్వరము మధురాతి మధురంగా ఉంటుంది. బాల్యావస్థలోఉన్న పసిపాప, ముసలికంఠంలో ఉన్న మాధుర్యాన్ని గుర్తించి తన్మయత్వం పొందుతుంది.

పాడిపాడి తాతగారు శేషును నిద్రపుచ్చి, తీసికొనివచ్చి శాంతం పక్కలో పడుకోబెట్టి తాను వెళ్ళి వేరే మంచంపైన పడుకొని తృప్తిగా నిద్ర పట్టించుకొన్నాడు. శేషు బా అమ్మ కడుపులోదూరి హాయిగా నిద్రపోయింది.

లోకం అంతా నిద్రపోయినా, ఆ చంద్రుడుమాత్రం ఆకాశంలో అల్లాగే ఉన్నాడు. మేఘాలను అడ్డంచేసికొని మధ్య మధ్య కొన్ని నిమిషాలపాటు కునికినా, మొత్తంమీద రాత్రంతా మేలుకొనే ఉన్నాడు. మల్లెపూలకూ కలువపూలకూ తెల్లదనాన్ని పంచి ఇయ్యడమే అతడు చేస్తున్న పని. నూతన వధూవరులు ఏకశయ్యపై నిద్రిస్తూ ఉన్నపుడు ఆ గదిలోకి తొంగి చూచి వారి హృదయాలపై కొంచెము అమృతము చిలకడం కూడా ఆయన చేస్తూఉన్న పనులలో ఒకటి.

మరునాడు అంతా నిద్రలేచిన తరువాత కొంచెము ఆల స్యంగా నిద్రలేచింది సుందరి. జయమ్మ ఎదురుగా వెళ్ళి వదినను కౌగలించుకొని వక్షోజాలపై చెయ్యివేసి "ఏం వదినా, ఇంత ఆలస్యంగా నిద్రలేచావు! మెత్తని పక్క వేసినా నీకు రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదా ఏమిటి?" అని పరిహాస మిళిత సమాద రణ స్ఫోరక మందహాసం చేసింది. సుందరి, ముంచుకువస్తూఉన్న సిగ్గును అణచుకొని "పో, వదినా" అని ముఖం కడుక్కొనేందుకు వెళ్ళిపోయింది. పోతూపోతూ ఒక చిరునవ్వు విసిరిపోయింది. ఆ మందహాసపు కాంతులు జయముఖంపై పడ్డవి. ప్రాతస్సమయ అరుణ కాంతులు పడి బంగారపు జరీవలె ధగధగ మెరసిపోయే మేఘపుటంచువలె ఆమె ముఖం ప్రకాశించింది.

## ౧౦

ఆ రోజుననే మధ్యాహ్నం జయ తన సంసారపు గొడవ కొంత చెప్పింది. "మీ అల్లుడు డబ్బు ఏమీ జాగ్రత్తగా వాడడం లేదే అమ్మా. ఎంతడబ్బు అయినా చాలదే ఆయనకు! తగలవేయడంలో ఆయనకు మించిన చెయ్యి లేదు. ముఖ్యంగా కాఫీ హోటలుకు ఎంత చేసినా నెలకు పది, పదిహేను రూపా యలు ఖర్చు చేస్తారు ఆయన. మాకువచ్చే ఆదాయం అంత ఎక్కువైనది ఏమీకాదుగదా అమ్మా. ఆయన అల్లాగ ఖర్చు చేయడము ఏమైనా బాగుందిటే! ఎంత నోరు పెట్టుకొని మొత్తుకొన్నా వినరు. ఉన్న ఖర్చులన్నీ ముందే ఉన్న య్యాయె! పిల్లలకు చదువులూ, పెళ్ళిళ్ళూ ఇవన్నీ జరగ

వలసి ఉండె! కాస్త ముందుచూపు ఉంటోద్దు టే!" అని జయ తల్లితో చెప్పుకొన్నది.

"పోనీలేవే అమ్మాయీ, 'నాయిష్టం సంపాదిస్తున్నాను ఖర్చు చేస్తున్నాను. నీకేం?' అంటాడు. ఈ విషయంలో ఆయనతో నీవు కోట్లాట పెట్టుకోబోకే తల్లీ!" అని కాంతం హితవు చెప్పింది జయకు.

"పెట్టుకోక నోరుమూసుకొని ఊరుకొంటావా?" అని అడిగింది జయ.

"ఊరుకోక ఏంజేస్తావే అమ్మాయ్. పోట్లాడితే ఎమైనా ప్రయోజనం ఉందా! అది సరేగాని అమ్మాయ్, ఆయనకు కావలసింది కాఫీయేకదా, అది నీవే చేసి ఇయ్యకపోయినావా?" అన్నది కాంతం.

"చేసి ఇస్తూనే ఉంటానే, ప్రొద్దుటిపూట ఇంట్లోనే తాగుతారు. మధ్యాహ్నంపూట ఫలహారం, కాఫీ మటుకు ఆయన హోటలునుంచి తెప్పించుకు తింటారు. ఇంట్లో జేసినవి, ఆయనకు బాగుండవట!"

"ఇంటిలో చక్కగా సేత్రతో చేసిన వస్తువులు బాగుండక పోవటం ఏమిటే! కాఫీ హోటలులో ఏ డాల్డాతోనో చేసిన వస్తువులు బాగుంటాయి గాబోలు ఆయనకు!" అని కాంతం ఆశ్చర్యాన్ని ప్రకటించి నిట్టూర్పు విడిచింది. విడిచి "పోనీ లేవే తల్లీ, ఎక్కడ ఇష్టమో అక్కడే తిననియ్యి ఆయనను. ఇంతలో కొంప గుల్ల అయిపోయేది ఏమీలేదులే" అన్నది.

ఉద్రిక్తభావంతో జయ తల్లికి దగ్గరగా జరిగి, "బాగుండక పోవడమూ కాదూ నాబొందా కాదు. అదో కర్మము" అని, "ఏం జేశానో తెలుసా ?" అని జయ కనుబొమ్మలు ఎగురవేసింది.

జయ ఏదో పెద్దపోట్లాటే తీసుకొచ్చి నట్లుందని తల్లి భయపడ్డది. ఆ విషయం ఏమిటో తెలుసుకోవలెనని ఆతురతను తెలియపరిచే చూపులు చూచింది కాంతం.

పరిహాస మార్దవమైన చిరునవ్వులు ఒలకబోస్తూ జయ చెప్పుకుపోయింది. "ఏం జేశానా, అమ్మా, రోజూ ఆఫీసు జవానుచేత కాఫీహోటలునుంచి ఆయన ఫలహారాలు తెప్పించుకోనడము నేను కనిపెట్టానే. ఆ జవాను మా యింటి ముందుగానే పోతూ ఉంటాడు లే. ఒక రోజున వాణ్ణి పిలిచి "ఎక్కడికి కనకయ్యా వెళుతున్నావు అన్నాను. కాఫీహోటలు కమ్మా, అయ్యగారికి ఫలహారం తేవడానికి వెళ్లుతున్నాను" అన్నాడు.

సరే, ఇట్లా ఉండా వ్యవహారం అని వాడితో కాస్త మంచిమాటలాడి "కనకయ్యా చూశావా మీ అయ్యగారి వ్యవహారం. ఇంట్లో నేను ఫలహారాలు చేసియిస్తే ఆయనకు పనికి రాదుట. ఆ వెధవ నూనెతోనో డాల్డాతోనో చేసినవి తెప్పించుకు తింటారూ! ఇల్లాగ చేస్తే ఆరోగ్యం చెడిపోక ఉంటుందా ?" అన్నాను.

కనకయ్య నా మాట నిజమేనని ఒప్పుకొన్నాడు. నేను అతనితో ఒక రహస్యం చెప్పాను. "కనకయ్యా ఒక సంగతి

చెబుతాను విను. రేపటినుంచీ ఆ ఫలహారం నేనే చేసియిస్తాను. ఇక్కడినుంచే తీసుకొని వెళ్ళు. ఆ డబ్బు నాకే ఇయ్యి. కాఫీ హోటలునుంచే తెస్తున్నానని చెప్పు. వ్యవహారం ఎల్లాగ నడుస్తుందో చూద్దాము” అన్నాను.

కనకయ్య ఈ ఏర్పాటుకు సంతోషంగా ఒప్పుకొన్నాడు. దీనివల్ల వచ్చే ప్రమాదం ఏమీ లేదని అతను ఊహించాడు. సరే నంటే సరే అనుకొన్నాము. మరునాటినుంచీ ఒకరోజు గారెలూ ఒకరోజు బజ్జీలూ, ఒకరోజు పెసరట్టూ ఇల్లాగ రోజుకో ఫల హారం చేసి పంపేదాన్ని. ఆ పావలో అర్ధో నేనే తీసుకొనే దాన్ని !

ఈ కథ ఇంతవరకు విని కాంతం సంతోషించింది, తన కూతురు కాంగా ఇంత తమాషా చేయగలిగింది కదాయని! సుందరికూడా ఈ సంగతి అంతావిని, జయ వీపుమీంచ చేయి వేసి మృదువుగాతట్టి “ఎంత గడుసుదానివి వదినా నీవు! మా అన్నయ్యను చాలా బాగా మోసపుచ్చావే! అయితే మా అన్నయ్య ఈ విషయం కనుక్కోనే లేదన్నమాట!” అన్నది. కాంతానికికూడా అదే సందేహం కలిగింది. “అల్లుడు కనుక్కు న్నాడుటే అమ్మాయ్ ?” అని అడిగింది కళ్ళు తళతళా మెరిపిస్తూ.

మొగుడికి ఆమాత్రం తెలివితేటలు లేవనో, తాను పన్నిన పన్నాగం అభేద్యమైనదనో మరి ఎందుకో కాని అవ్య క్తమైన ఆనందం పొంగులాగ వచ్చింది జయ ముఖంలోకి.

చిరునవ్వులు ఒలకపోస్తూ జయ అన్నది. "కనుక్కో-వాలసిందే, ఏమిటి కనుక్కునేది! పైగా అన్నారుట, "ఏ హోటలులో తెస్తున్నావోయి ఇవి ఇంత బాగున్నవి" అని.

ఈ జవాను తెలివి చూడు. పెద్దదైన ఉడిపి హోటలు పేరు చెపితే, రహస్యం బైట పడుతుందేమోనని శాస్త్రి ఆలోచించి, మరో చిన్న హోటలుపేరు చెప్పాడుట !

"బాగానే చెప్పాడు!"అని సుందరి కనకయ్య తెలివితేటలకు సంతోషించి "అయితే మా అన్నయ్యకు తెలియనే లేదన్నమాట!" అని అదియొక విచిత్రవిషయంగా భావిస్తున్నట్లు కళ్లు పెద్దవిచేసి చూచింది.

కాంతం మటుకు, కథ అంతటితో ఆగిపోలేదనీ, ఏదో జరిగిందనీ ఊహించి "ఊఁ" అన్నది, ఆ తరువాత సంగతి చెప్పమన్నట్లు.

జయ చెప్పుకుపోయింది. రోజూ ఇల్లాగేయిస్తూ ఉండేదాన్ని పలహారాలు. జాగ్రత్తగా చేసేదాన్ని. డబ్బుకూడా చేతిలో పడుతూఉండె పానలో అర్థో ! నాకుకూడా కాస్తో, కూస్తో మిగులుతూ ఉండేది! అయితే పూటకూళ్ళ దానిలాగ ఫలహారాలు అమ్మి డబ్బు చేతిలో వేయించుకొంటున్నానే అని కాస్త మనస్సుకు కష్టంగా ఉంటూ ఉండేది. జయ ఒకక్షణం ఆగింది.

"ఎందుకూ కష్టం! నీవేమన్నా పరాయివాళ్ళకు అమ్ముతున్నావు గనకనా! నీ మొగుడికే అమ్ముతుంటివి. ఇందులో

తప్పు ఏముందీ వదినా ?" అని జయమ్మ చేసిన పని చాలా మంచిదే అయినట్లు సుందరి మెచ్చుకొన్నది.

జయమ్మ కాస్త విచారంతోనూ కాస్త ఆనందంతోనూ చెప్పసాగింది. నేనూ అల్లాగే అనుకొని సరిపెట్టుకు పోయి నాను వదినా. ఒకరోజున ఏమైంది అనుకొన్నావూ...

ఈ మాట వినేసరికి కాంతం గుండెలు కొట్టుకొన్నవి. ఈ వ్యవహారం అంతా ఏదో పెద్ద పోట్లాటలో పర్యవసించింది కామోలు ననుకొన్నది.

మామూలుగానే సాయంత్రం ఇంటికి వచ్చారు. నేను ఏమీ తెలియనిదానిలాగ అడిగాను. "ఏమండీ మధ్యాహ్నం ఏదైనా తింటున్నారా ? ఇంట్లో చేసి పంపుతానంటే వద్దంటిరి. హోటలునుంచి అయినా తెప్పించు కొంటున్నారా, అదీ లేదా ?" అని అడిగాను, ఆయన ఏమంటారో చూద్దామని.

"ఇంట్లో చేసినవి బాగుండవు. నీకు చేయడమూ తెలియదు. హోటలునుంచి తెప్పించుకుని తింటున్నాను. ఎంత బాగుంటున్నయి అనుకొన్నావు!" అని ఎంతో మెచ్చుకొన్నారు ఆయన.

నేనూ చేయగలనండీ. ఒకసారి చూడండి. అన్నాను.

ఆయన విసుగుతో, "చాల్లే నన్ను చంపక, డబ్బు పోతే పోయింది. ఒకకానో అర్ధనో ఎక్కువైనా కమ్మగా తింటు న్నాను. ఊరుకో, ఇంటిదగ్గర చేసి పంపుతానంటూ నన్ను వేధించక" అన్నారు ఆయన. సరే బాగానే ఉందని మనస్సులో సంతోషించి ఊరుకొన్నాను.

"చెప్పేయక పోయినావటే నేనే పంపుతున్నానని !" అన్నది కాంతం.

జయ వికారంగా ముఖంపెట్టి "చెప్పకుంటావుటే ఎక్కడైనా! నీ తెలివి తెల్లవారినట్లే ఉంది!" అని, తల్లి చెప్పినట్లు చేయడంకంటే తెలివితక్కువ పని ఇంకొకటి లేదన్నట్లు తేల్చింది. అల్లాగ చెప్పటం మంచిదికాదని సుందరికూడా ఒప్పుకొన్నది.

"దాని తరువాత ఏమైందీ?" అని కాంతం అడిగితే జయ అన్నది. ఇట్లాగే నాలుగైదు నెలలు గడిచింది. దాని తరువాత ఆయన చేతిలో డబ్బు ఆడటం తక్కువ అయింది జీతాలు సమయానికి రాకపోవడం మూలాన. అందుకని ఆయన అప్పు తెమ్మని పంపాడు జవానుని.

జవాను ఆమాట నాకు చెపితే, "సరేలే అయ్యగారితో అల్లాగే అప్పు తెస్తున్నానని చెప్పు" అన్నాను.

ఆనెల పదిరూపాయలు అయింది. జవాను నెల ఆఖరుకు అడిగితే ఆయన ఇస్తానులే అన్నారట ! మరునాడు సాయంత్రం ఎందుకు బుద్ధి పుట్టిందో ఏమో, ఆయనే ఉడిపి హోటలుకు పక్కనున్న హోటలుకుపోయి ఏమండీ మీకు ఎంత ఇయ్యాలని అడిగినారుట! వాళ్లు తెల్లపోయి "ఏమీ ఇయ్యనక్కర లేదండీ" అన్నారుట! రోజూ ఫలహారం పంపుతున్నది మీకు కాద్దాంటే, మేము కాదనికూడా చెప్పినారట.

సరే ఎక్కడనుంచి తెస్తున్నాడోలే అనుకొని అప్పటికి వెళ్ళిపోయి, మరునాడు జవానుని అడిగారుట నీవు ఎక్కడ నుంచి తెస్తున్నావు ఫలహారాలు అని !

వాడికేం తెలుసు! ఉడిపి హోటలుకు పక్క హోటలులోనండి అన్నాడు. నేను వెళ్ళి అడిగితే మేము మీకేమీ ఫలహారాలు పంపటంలేదే అన్నారేం అని అడిగారు ఈయన.

"కనకయ్య తెల్లముఖం వేయలా ?" అని సుందరి అడిగింది.

కనకయ్య చాలా తెలివిగా ఆలోచించి ఉడిపి హోటలుకు పక్క హోటలులో ఇప్పుడు తేవడము లేదండీ, వాడు అప్పు ఇయ్యటంలేదు పక్క సందులోఉన్న ఇంకొక హోటలు నుంచి తెస్తున్నానని, తడుముకోకుండా చెప్పివేశాడు.

ఈయనకేదో అనుమానం కలిగి రేపు ఆ హోటలు నాకు చూపించు – అని కోపంగా అన్నారు. ఆ సాయంత్రము వాడొచ్చి నాతో ఒకటే గోల, ఇప్పుడేం చెయ్యమంటారండీ అమ్మాయిగారూ అని !

నాకు ఏమీ తోచలేదు. దరిద్రపు అవస్థ వచ్చిపడ్డది. ఆ హోటలేదో చూపకపోతే ఆయనకు కోపంవచ్చి వాడిమీద విరుచుకు పడతారు. నిజం చెపితే నాకు అవమానం !

"అప్పుడు ఏం చేశావు వదినా" అని అడిగింది సుందరి కౌతుకంతో. కాంతం ముఖం తెల్లబడ్డది.

జయ చెప్పింది, నాకు ఏమీ తోచడము లేదయ్యా కనకయ్యా. ఏదైనా ఉపాయం తోస్తే, సరేసరి, లేకపోతే నిజం చెప్పేశెయ్యి ఏం జేస్తావు" అన్నాను.

"వాడు నిజం చెప్పాడు కదూ" అని ఆదుర్దా పడ్డది కాంతం. "అప్పుడేమైంది వదినా?" అని భయంతో అడిగింది సుందరి.

జయ కాస్త నవ్వుతూనే అన్నది– ఆ జవాను నిజంగా తెలివిగలవాడే అమ్మా. మరునాడు వాడు మీ అల్లుడు దగ్గరకు వెళ్ళి "బాబూ క్షమించండి. ఆ ఫలహారాలు నేను ఏ హోటలులోనూ తీసుకురాలేదు. నా కుమార్తెచేత చేయించి తీసుకొస్తూ ఉండేవాణ్ణి. మా అమ్మాయి పరిశుభ్రంగా చేసి పెట్టింది బాబూ, కోప్పడకండి. నా తల్లిమాట కాదనలేకపోయినాను. నాతల్లి బంగారుకొండ బాబూ. మాఅమ్మకు ఎవరికీ ఏదీ, అమ్మే పనిలేదు బాబూ. మీరువచ్చి అడిగితే నా బిడ్డ సిగ్గుపడి ఏడుస్తుంది. మీరు రావద్దు. నా బిడ్డ అవమానింపబడితే నేను చూడలేను అని కనకయ్య కళ్ళనీళ్లు పెట్టుకొన్నాడే! అమ్మా వాడి హృదయం ఎంత అమృతమయమో! రహస్యం కడుపులో పెట్టుకొని పొక్కనీయక నన్ను బిడ్డను కాపాడినట్లు కాపాడాడు. కనకయ్య ఎంత మంచివాడో చూశావా అమ్మా!

సుందరి కళ్లు రెండూ పెద్దవి చేసి ఆశ్చర్యాన్ని ప్రకటించింది. కాంతం ముఖం వంచుకొని ఊరుకొన్నది. ఆమె పాపిటిలోని కేశములు పలితములైనప్పు, ధగధగ మెరుస్తూ ఉన్నవి.

ఆమె వంచిన తల ఎత్తలేదు. జయమ్మే మాట్లాడను ఆ కథ ఇల్లాగ పూర్తిచేసింది.

మీ అల్లుడి గుండె నీరై పోయిందట అమ్మా! ఆయన అన్నాడట, "పోనీ లేవోయ్ నీవు చేసినది ఏమంత తప్పు పని అని నీవు అంతగా విచార పడతావూ! మీ అమ్మాయి మంచి పనే చేసింది. కమ్మని ఫలహారాలు పంపింది. నేనుకూడా సంతో షించానని చెప్పు. ఇదిగో, ఫలహారాలకు ఇయ్యవలసిన పది రూపాయలు కాక ఇంకా అయిదు ఎక్కువ ఇస్తున్నాను. తీసు కొనిపోయి నీ కూతురుకు ఇయ్యి" అన్నారట. పాపం మీ అల్లుడుగా మంచివారే ఈ విషయంలో. కనకయ్య ఆ పదిహేను రూపాయలూ తీసుకొచ్చి నా చేతిలో పెట్టాడు.

"ఆ పదిహేను రూపాయాలూ నీవు తీసుకొన్నావా వదినా?" అని సుందరి అడిగింది ఏమి తోచిందో ఏమో ఆ పిల్లకు.

ఎందుకు తీసుకొంటానూ వదినా. కృతజ్ఞతా భావంతో నా హృదయం బరువెక్కిపోయి, 'కనకయ్యా, నీవు ఏమీ అను కోకు. వద్దనకు. ఈ పదిహేను నీవు తీసుకో' అని బ్రతిమలా డాను. అతడు తీసుకోలేదు. తీసికోక 'నాకొద్దు అండీ, అమ్మాయిగారూ, అమ్మా, మిమ్ములను కూతురుగా చూచు కొంటున్నాను. కూతురు సొమ్ము తండ్రి ఎక్కడైనా తీసికొం టాడటండీ అమ్మాయి గారూ. మీరు మంచి చీర కొనుక్కోండి' అనిచెప్పి వెళ్ళిపోయినాడు.

ఈ కథ అంతావిని సుందరి ఆశ్చర్య చకితురాలు అయింది. ఇది ఒక వినోదమైన విషయంగా మాత్రమే సుందరి గ్రహించింది. కనకయ్య చూపిన ఔదార్యం ఉత్తమోత్తము మైనదని గ్రహింపులేదు సుందరికి.

కాంతం, సంగతివేరు. ఆమె కనకయ్య మంచితనాన్ని పూర్తిగా గ్రహించింది. ఆమె కళ్ళవెంట ఆనంద బాష్పాలు వర్షించినవి. "నా తల్లె, ఆ కనకయ్య ఎంత మంచివాడె ! తన గౌరవం కాపాడుకొన్నాడు; నీ గౌరవం కాపాడాడు. మనుష్యులలో దేవతలు ఉంటారే తల్లీ. దేవతలూ మనుష్యులే" అని తాను ఎప్పుడూ అంటూన్న మాటే మరోసారి అన్నది. అనడంకాదు అది గానం చేసింది. ఆమె హృదయం ఆ గానానికి లయయుక్తంగా తాళం వేసింది. ఆమె ప్రతి అవయవమూ నృత్యం చేసింది. ఎవ్వరికీ కనుపించని ఆ నృత్యమూ,వినిపించని ఆ గానమూ దేవతలుమాత్రం చూచి, విని సంతోషించారు.

ఒక్క మంచిపని, ఒక్కచిన్న ఉపకారము ఒక్క సుకృతి మానవ హృదయాన్నే ఇంతగా చలింపజేస్తే, దయామయుడైన ఆ భగవానుని ఎంతగా చలింపజేస్తుందో !

శివుడు ప్రతిరోజూ సంధ్యాసమయంలో తాండవం చేయడం ఏ మానవుడు చేసిన త్యాగానికి సుకృతికి ఒళ్ళు పులకరించో కదా !

అప్పటికి సాయంత్రం కావచ్చింది. గులాబి పూలు పరచినట్లు పశ్చిమ దిశ అరుణ రాగాంకితమైనది. దేవలోకస్రు

వీధులు మానవులకు కనుపించినట్లు అయింది. మేఘకన్యలు రంగురంగు చీరలు కట్టుకొని ఆ వీధులలో నృత్యం చేస్తున్నారు. లోకం అంతా ఆనందమయం అయింది. పక్షిజాతి అంతా కిల కిలమంటూ తమ సంతోషాన్ని గానరూపంలో ప్రకటితం చేసింది. కాంతం కంఠంలోని గానం ఆ గానంలో ఏకీభూతము అయింది. పండుటాకుల కదలికలోనూ వృక్షముల తల ఊపుల లోనూ ప్రకటితమైన ఆ విశ్వనృత్యంలో కాంతం మానసికంగా లీనం అయిపోయింది.

## ౧౨

ఇంతలో ప్రొద్దుగూకింది. చీకట్లు వ్యాపించినవి. ఆ తరువాత మరికొన్ని ఘడియలకు వెన్నెల వచ్చింది. దేవలోకములోని అప్సరసలు పక పక నవ్వినట్లు పండువెన్నెలలు ప్రకాశించినవి. అప్సరలు తమ తెల్లచీరలను ఆర వేయగా తత్పరిధాన చేలాంచలములు మందమారుత స్పర్శచే కదలినట్లు వెన్నెల తరంగములు తళతళలాడినవి.

వెన్నెలరాయడు కాంతం గృహప్రాంగణాన్నే తన దివ్య సింహాసనాన్ని నెలకొల్పాడు. తత్ప్రదేశమంతా తెల్లని దుప్పట్లు పరచినట్లు, విరియబూచిన బొడ్డుమల్లెలతో కప్పినట్లు, వైభవముగా ఉన్నది.

ఆ రోజున పిల్లలూ తాతగారూ ముందుగా భోజనం చేశారు. కొడుకుకోసం కూర్చున్నది కాంతం. కొడుకుకు పెట్టిగాని ఆమె తినదు.

"వారు ఆలస్యంగా వస్తారో ఏమో ఎంతసేపని కూర్చుంటూరు అత్తయ్యా. మీరు భోజనంచేసి పడుకోండి. నేను ఉన్నానుగా వారికి వడ్డించడానికి!" అన్నది సుందరి.

ఈ మాటవిని కాంతం అన్నది "అదేమిటే కోడలా అట్లాగంటావు. అబ్బాయి తినకముందు నేను తినగలనా? ఏవేళకైనా రానీ వాడికి నేనే పెడతాను. వాడు అన్నం తినడము చూస్తూఉంటే నాకేదో తృప్తిగా ఆనందంగా ఉంటుందే కోడలా! వాడికంటె ముందు నేను విస్తరిముందు కూర్చున్నా ఒక్కముద్ద అయినా లోపలికిపోదు. తల్లిప్రాణం అంతేనమ్మా. నాకే విచిత్రంగా ఉంటుంది తల్చుకొంటే ఆ సంగతి!"

ఆక్షణిమిషంలో కాంతం కాంతంగా లేదు. ఆమెరూపు కట్టిన మాతృప్రేమ. ఆమె చేలాంచలము గాలికి టపటపలాడి ఆ మాతృహృదయ స్పందనను వెలిగ్రక్కు తున్నట్లున్నది. ఫుల్ల ప్రసూనకాంతిచ్ఛటాభిరామమైన ఆ వెన్నెలలో ఆమె కల్పవృక్షమువలె నుంచున్నది.

కొడుకుపై ప్రేమలు వలకపోసిన అత్తగారివంక సుందరి నిదానంగాచూచి ఏదో జ్ఞాపకంరాగా తలవంచుకొని, లజ్జా పిహిత మధురమూర్తియై ముంచుకపోయింది. కాంతం చటుక్కున గ్రహించి కోడలువైపు తిరిగి, సుందరిని తన కౌగిలిలోకి తీసికొని మృదువుగా హత్తుకొని "నన్ను పిచ్చిదాన్ని అనుకుంటున్నావు కదూ! నీకూ తెలిసొస్తుందిలేవే కోడలా.

కొన్నాళ్లు పోనీ" అన్నది. కోడలు సిగ్గుపడి అత్తగారి ఒడిలో తల దాచుకొన్నది.

ఇంతలో జయ రవిగాడిని ఎత్తుకొని విసుక్కుంటూ వచ్చింది. గంటసేపటినుంచి వాడితో అది సతమతం అవుతున్నది. వాడు నిద్రపోడు. బుజంమీద పడుకోడు. జారి పోతాడు. పోనీగదా అని దింపితే ఎత్తుకోమని ఏడుస్తాడు. వాడికి ఏమికావాలో తెలియదాయె! జయకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. వాణ్ణి తల్లికి అందిస్తూ "ఎంతసేపటికీ నిద్ర పోడేమే! ఎట్లా వీడితో!" అన్నది.

కాంతం వాణ్ణి తనచేతుల్లోకి తీసికొని "ఎక్కడికి పోతయ్యో అమ్మాయ్. తల్లి బుద్ధులే కొడుక్కు వచ్చినయ్! చిన్నప్పుడు నీవూ అంతేగా! ఒక్కతీరాన నిద్రపోయేదానివా! మేకులాగ అల్లాగే కూర్చునేదానివి! ఒకొక్కరోజు రాత్రి పది అయినా నిద్ర పోయేదానివి కాదు. ఎంతకష్టపడి పెంచందే పిల్లలు పెద్దవాళ్ళు అవుతారే అమ్మాయ్!" అన్నది.

జయకు ఇప్పుడు తెలిసొచ్చింది తనతల్లి ఎంతకష్టపడి తమనందరినీ పెంచిందో! ఆ పిల్ల హృదయంలో తల్లియందు కృతజ్ఞతాభావం ఉదయించింది కాని, దానిని వాగ్రూపంలో ప్రకటించేశక్తి ఆ అమ్మాయికి లేదు. ఆ కారణాన ఆ భావం జలాశయంలోని చిన్ని తరంగంవలె పుట్టినచోటనే దాగి పోయింది.

అదే సమయంలో తాతగారు వెన్నెలలో మంచంపైన పడుకొని మనుమరాలుకు అంకెలు నేర్పుతున్నాడు. ఆయన జీవితం అంతా ఉపాధ్యాయ వృత్తిలోనే గడిపిన కారణాన ఆయనకు పిల్లల మనస్తత్వం బాగా తెలుసు. అందుకనే ఆయన ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు అని అయిదు అంకెలు మాత్రమే చెపుతున్నాడు. ఆ అయిదు అంకెలూ బాగా వరుసలో చెప్పగలిగిన తరువాత మరో అయిదు అంకెలు చెబుతాడు. ఆ పద్ధతి అంతా ఆయనకు బాగా తెలుసు. ఒకటీ, రెండూ ఇల్లాగ అయిదుదాకా నాలుగైదుసార్లు చెప్పి, "చెప్పమ్మా, ఏదీ, ఒకటీ" అని అందించాడు. శేషుకు అప్పటికే అయిదు అంకెలు బాగా వచ్చినవని ఆయన అనుకొన్నాడు. శేషు చెపుతున్నది. "ఒకటీ, రెండూ, మూడూ" అని వరుస తప్పకుండా చెప్పుకుపోతున్నది.

తాతగారు అంతులేని ఆనందాన్ని పొందుతున్నాడు. ఇక మూడు అన్న తరువాత నాలుగు అనాలె. అంటుందని అనుకొన్నాడు.

శేషుకు మూడు తరువాత అంకె జ్ఞాపకం రాకనో ఏమో, మూడూ, మూడూ అని రెండుసార్లు అని చటుక్కున 'పదకొండు' అన్నది.

తాతగారు నవ్వాడు. నవ్వి "మూడు తరువాత నాలుగే అమ్మా" అని చెప్పాడు. శేషు తప్పుదిద్దుకొని నాలుగు అనక "నాలుగుకాదు తాతా, పదకొండు" అని తాతకే చదువు చెప్పింది.

"మూడు తరువాత నాలుగే అమ్మా, పదకొండు కాదు" అని ఎంత మొత్తుకున్నా శేషు వినక "కాదు తాతయ్యా పదకొండే"నని,. గట్టిగా వాదించింది. ఎంత చెప్పినా వినలేదు. ముసలాయనకు విసుగెత్తి, మూడుతరువాత నాలుగేనే అని గట్టిగా అరిచాడు. శేషు ఆ విషయాన్ని అంగీకరించక తన వాదాన్ని నిలబెట్టుకోవలెనని "మూడూ, పదకొండూ" అని మళ్ళీ మళ్ళీ అని రెట్టించటం సాగించింది. తాతగారు అన్నాడు "నాకు ఈ విషయం బాగా తెలుసునే తల్లీ. మూడు తరువాత నాలుగు! ప్రపంచం అంతా అంగీకరించిన విషయమేనే ఇది!" అని ఇల్లాగ ఎంత గోలపెట్టినా శేషు అంగీకరించక మూడు తరువాత పదకొండేనని గట్టిగా వాదించినట్లు పదే పదే "మూడూ పదకొండూ" అన్నది.

తాతకు కోపంవచ్చి విసుక్కునేసరికి శేషు పెద్దగా ఏడ్వ లకించుకొన్నది. ఎంత బతిమిలాడినా ఊరుకోలేదు. చివరకు ముసలాయన మూడు తరువాత పదకొండేనని చచ్చినట్లు ఒప్పుకోవలసి వచ్చింది!

ఆ తరువాత శేషు గణిత శాస్త్రంలో తాను కనిపెట్టిన విషయాలన్నీ తాతకు చెప్పి ఆయనచేత ఒప్పించింది. మూడు తరువాత పదకొండు అన్నమాట అటుంచి ఒకటి తరువాత పదకొండు అన్నా తప్పులేదట! పదకొండు అన్నమాట సర్వత్ర ఉపయోగించ వచ్చునని దానివాదం! తాతగారు దాని సిద్ధాంతాన్ని పూర్తిగా అంగీకరించాడు!

శేషు వ్యాకరణ శాస్త్రంలోకూడా కొన్ని సంస్కరణాలు సూచించింది. "రాయి" అనే మాటకు "రాయిలు" బహువచన రూపమట! చేత్తా, వత్తా, అనే రూపాలు సాధువులట! "తాతారు, నాన్నారు" అనే పదాలు సాధువులు అనిఅంటుంది. నోరు లేదుగాని 'తాత, నాన్న' మొదలగు పదంబులకు, గారు పరంబగునపుడు ప్రాయికంబుగ, 'గ' లోపించి తత్పూర్వాక్షరము దీర్ఘంబగు, అని అదిసిద్ధాంతీకరిస్తున్న దన్నమాట! ఈ సూత్రీకరణను, ముసలాయన అంగీకరించక తప్పిందికాదు.

చిన్నశేషు ఆ కథకచక్రవర్తికి అనేకములైన వ్యాకరణ విషయాలు తెలియబరచి నిద్రాసక్తురాలై ఆవలించి నిద్రపోయింది.

## ౧౮

మరునాడు ఉషఃకన్యలు తూర్పుదిక్కున ప్రభాతనృత్యం చేస్తూఉండగా పక్షులు ప్రభాత గీతాలు పాడుతూఉన్న సమయాన కాంతం కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం చేసి, తలలో మందారపూలు పెట్టుకొని తులసిపూజ చేసుకొన్నది.

పార్వతమ్మ వచ్చి, "ఇవాళ ఏమో బరువుగా ఉంది వదినా, ఏమీ తోచటం లేదు. ఆకలి కూడా అవుతున్న దేమిటి! ఇంత ప్రొద్దున్నే ఆకలేమిటి వదినా?" అని అడిగింది. పైత్యంవల్ల అలాగుందికాని మరేమీ కాదనీ భయపడవలసిన పని లేదనీ చెప్పి, కాంతం పార్వతమ్మను పంపించింది. పార్వతమ్మ ఈ మాటలవల్ల ఎంతో స్థైర్యాన్ని పొందినది.

ఆ తరువాత మణెమ్మవచ్చి తల దువ్వించుకుపోయింది. వీరయ్యగారి కుమార్తెవచ్చి రెండు పొట్లకాయలు పట్టుకొచ్చి యిచ్చి, "అమ్మ ఇయ్యమన్నది అత్తయ్యా" అని చెప్పి వెళ్ళింది.

కాంతం చిన్న శేషుకూ, పెద్ద శేషుకూ చనిగాడికీ తలంట్లు పోసింది. చిన్నశేషు సిల్కుగౌను తొడుక్కొని బంగారు తల్లిలాగు తయారైంది. కాంతం దానిని దగ్గరకు తీసికొని కళ్ళకు కాటుకపెట్టి చుక్క బొట్టు పెట్టి ముద్దాడింది.

కాంతం అనుకొన్నది; "నేను పెద్దదానిని అయినాను. ఎన్నాళ్ళని చేసుకోగలను. మనుమరాళ్లు చేతికి అందివస్తే బాగుండు. అన్నీ అందిస్తూఉంటే నేను ఇంతవండి పడేస్తాను. మా చిట్టితల్లి పెద్దఅయిన తరువాత అన్నిపనులూ చేసిపెట్టదూ!"

"ఏమే చిట్టితల్లీ! పెద్దదానవు అయిన తరువాత అన్ని పనులూ చేసిపెడతావా?" అని అడిగింది. అది బాఅమ్మను కౌగలించుకొని "చేత్తా, బాఅమ్మా, చేత్తా" అని ముద్దుపలుకులు పలికింది.

కాంతం అమితమైన ఆనందాన్ని పొందింది. ఆ బిడ్డ పెద్దదై తనకు అన్నివిధాల సాహాయపడుతుంది అని అనుకొని కామాలు పరమానందభరితురాలై పోయి దాన్ని ఎత్తుకొని, ఫాలభాగాన్ని, పాల బుగ్గలను చిబుగడ్డాన్ని, చిట్టి చేతులను, పాల బొజ్జను పదేపదే ముద్దాడి "పరా తల్లే, సంచి మాట అన్నావే తల్లీ. నీవు పనిచేస్తే నేను కూర్చుని సుఖపడే

రోజులు వస్తయ్యో రానే రావో!" అని పిల్లను గట్టిగా హృదయానికి హత్తుకొన్నది.

ఇంతలో పెద్దశేషు వచ్చి అమ్మమ్మ వీపుమీద ఎక్కి "నేనూ చేత్తాను అమ్మమ్మా నేనూ చేత్తాను" అన్నది.

ఇంక కాంతానికి కావలసింది ఏముంది! ఇద్దరు పిల్లలనూ, ఈ పక్కకూ ఆ పక్కకూ అదుముకొని నిమీలిత నేత్రాలతో, మనస్సులోనే భగవంతునికి నమస్కరించి, "ఈ మనుమరాళ్ళ చేత సేవ చేయించుకొనే అవకాశం నాకు కల్పించు మహాప్రభూ!" అని ఆ బహుకుటుంబీకుణ్ణి దీనంగా ప్రార్థించింది.

రవిగాడు పక్కనే ఉయ్యాలలో పడుకొని కిలకిల నవ్వాడు. కాంతం హృదయం గంతులేసింది.

ఇంతలో సుందరి కాఫీ తయారుచేసి తీసుకొచ్చి ముందుగా మామగారికి ఇచ్చివచ్చింది. తరువాత వదినగారికి, చిన్న శేషుకు, పెద్ద శేషుకు తలాకాస్తా ఇచ్చింది. ముసలాయన ముందుగదిలో కూర్చుని తాను ఒక్కడే తాగటానికి ఇష్టపడక కూతురూ కోడలూ మనుమరాళ్ళూ ఉన్న గదిలోకి వచ్చి కూర్చున్నాడు.

అంతా కాఫీ తాగుతున్నప్పుడు ముసలాయనే అన్నాడు, "అన్నయ్య రాలేదేమే అమ్మాయీ!" అని. సుందరి, "ఆయన ఇందాకే తాగి వెళ్ళిపోయినారు మామయ్యగారూ" అన్నది. జయ కనుబొమ్మలు ఎగరేస్తూ అన్నది "ముందు మొగుడికే ఇచ్చుకొన్నావుటమ్మా వదినా" అంది, కాస్త ఎత్తిపొడుపుగానే.

సుందరి మనస్సుకు కష్టం వేసింది. తాను మొగుడికి ముందుగా ఇచ్చుకొందామని ఇచ్చిందా నిజానికి! రఘు పెంద లాడే నిద్రలేచి ముఖం కడుక్కొని 'సుందరీ నాకు ముందుగా కాఫీ ఇచ్చిపంపుతావు కదూ నేను అవసరమైన పనిమీద వెళ్లవలె.' అని అంటేకదూ తాను ఆదరా బాదరా చేసి ఆయ నకు ఇచ్చి పంపింది! తాను కావాలని మొగుడికి ముందుగా ఇచ్చుకొన్నట్లు వదిన అనడమువలన సుందరి మనస్సు చివుక్కుమన్నది.

ఇల్లాగ అనుకొని సుందరి ముఖం ముడుచుకొన్నది. కోడలు మనోభావాన్ని కాంతం గ్రహించింది. "ఏమిటే కోడలా, ఈ మాత్రానికే ముడుచుకుపోవాలా ఏమిటే! అది ఏమన్నదని అంత ఇది అవుతావు! వదినా మరదళ్లు ఆమాత్రం వేళాకోళం ఆడుకోరుటే, అమ్మాయ్. ఛా, తప్పమ్మా అల్లాగ మనస్సు కష్టపెట్టుకోకూడదు!" అని అన్నది.

జయ కూడా, ఆమాట అన్న తరువాత ఎందుకన్నానా అని నొచ్చుకొన్నది. "ఏమిటి వదినా నవ్వులాటకు అన్నాను. ఈ మాత్రానికే కోపం రావాలా! ఆడబడుచును గదా ఆమాత్రం మాట అనకూడదా ఏమిటి?" అని గునుపుగా అన్నది.

"ఎందుకు అనకూడదు వదినా. నాకేమీ కోపం లేదు" అని సుందరి మాట సామెతగా అన్నది కాని ఆ పిల్ల మనస్సు లోని అసంతృప్త్యాత్మకమైన భావము ఇంకా పోలేదని, జయ

గ్రహించి సుందరిని చెయ్యి పట్టుకొని తీసుకొని వచ్చి, తన ప్రక్కన కూర్చోబెట్టుకొని, పక్కనున్న వెండిగ్లాసులో కాఫీ పోసి "తాగు వదినా" అన్నది. వెండిగ్లాసువంక చూచి సుందరి నవ్వి "నాకు తెలిసిందిలే వదినా, వెండిగ్లాసు ఎందుకిచ్చావో– అల్లాకాదు వెండిగ్లాసులో నీవే తాగాలి. నీవు ఆడబిడ్డవు. నిన్ను నేను గౌరవించాలె. నీవు తీసుకో వదినా" అన్నది.

జయ అప్పటికీ తీసుకోక, "ఎట్లాగయినా ఇంటి యజమానురాలవు నీవేగా వదినా! నిన్ను మంచి చేసుకొంటేనే మాకు జరగాలిసిన మర్యాదలు జరగడం!" అన్నది.

"అదేమిటి వదినా అట్లాగంటావు. ఆడబిడ్డలు సంతోషిస్తేగాని ఇంటికి జయంగాదు" అని వదినగారు వెండిగ్లాసు తోనే కాఫీ తాగాలని పట్టుబట్టింది సుందరి.

ఈ చిన్న పోట్లాటలో ఇంత సరసమైన సంభాషణ జరగడం చూచి కాంతం ఆనందంతో పొంగిపోయింది.

సుందరి అడిగింది, "ఇంకా కాస్త పంచదార వెయ్యనా వదినా?" అని. "నీ తియ్యని మాటలవల్ల ఇప్పటికే కాఫీలో తీపి ఎక్కువ అయింది" అని జయ కిలకిలానవ్వి వదినను దగ్గరకు తీసికొని గట్టిగా కౌగలించుకొన్నది. పోట్లాట కావలసిన విషయం ఇంతచక్కగా సరసంగా తేలిపోయింది. ముసలాయన కూడా చాలా సంతోషించాడు.

ఇంతలో జామకాయలు అమ్మే మనిషి దొడ్లోకివచ్చి "అమ్మా, కాంతమ్మగారూ వస్తారా?" అని కేక వేసింది. కాంతం వెళ్ళి దానితో మాట్లాడుతూ కూర్చున్నది.

జామకాయలు అమ్మే మనిషి వచ్చినా, పెరుగుపోసే మనిషి వచ్చినా, తమపని చేసుకొని వచ్చినవాళ్ళు వచ్చినట్లు పోరు. కాసేపు కూర్చుని తమ కష్టసుఖాలు కాంతంతో చెప్పు కొంటారు. కాంతం ఓపిగ్గా వింటుంది.

జామపండ్ల అమ్మి తన గొడవ కాంతంతో చెప్తూవు న్నది. దానికూతురు పదిహేను రోజుల క్రితమే నీళ్ళాడలేక చనిపోయిందట!

"చెట్టంత బిడ్డను దిగమ్రింగాను తల్లీ! ఎంత ఏడ్చినా రాదుకదా! వీధులవెంట కాయలు అమ్ముకొంటూ దానిసంగతే తల్చుకు తల్చుకు ఏడుస్తాను. కడుపు తరుక్కుపోతుంది. నాబిడ్డ ఈ రంగే తల్లీ! జామపండులాటి రంగు! ఆ బిడ్డను పుట్టెడు దుఃఖానికి భగవంతుడికే అమ్మాను తల్లీ!" అని బొళబొళా ఏడ్చింది ఆ మనిషి.

కాంతానికి కూడా తన పెద్దకుమార్తె రుక్కుతల్లి సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఆమెకు తెలియకుండానే దుఃఖం పొంగివచ్చింది. కాంతం తన శోకగాద్గదికమును అదు పులో పెట్టుకొని ఆ మనిషితో అన్నది, "ఏంజేస్తాం వెంకాయ్, ఉన్నవాళ్ళను చూచుకొని సంతోషించాలె. ఎవరైనా అంతే.

ఏడిస్తే వెళ్ళిపోయినవాళ్ళు రారుగదా!" అని దానిని ఓదార్చి తన్ను తా ఓదార్చుకొన్నది.

కాంతం ఆ మనిషిదగ్గర పావలాకు నాలుగు కాయలు కొన్నది. కాస్త ఆవకాయ దొప్పలోపెట్టి దానికిచ్చి "ఎప్పుడైన వస్తూఉండు వెంకాయ్ ఏమున్నా పెడుతూ ఉంటాను" అన్నది. వెంకాయ ఆ కాస్త దానికే సంతోషించి బుట్ట నెత్తిన పెట్టుకొని, "జామపండ్లోయమ్మ జామపండ్లు!" అని కేకలేసుకొంటూ వెళ్ళిపోయింది.

కాంతం వెంకాయ మలుపు తిరిగిందాకా అక్కడే నుంచునిచూచి, "ఇంతేగదా జీవితం! ఏడ్పువస్తే కాసేపు ఏడ్వటం మళ్ళీ మామూలు ధోరణిలో పడిపోవడం" అనుకొన్నది. కాంతం మానవ జీవితము యొక్క స్వభావాన్ని గురించి కాసేపు ఆలోచించి ఇంట్లోకి వెళ్ళింది. వెళ్ళి ఆ కట్టుకున్న బట్ట విడిచేసి చెంబెడునీళ్ళు పోసికొని, మడిబట్ట కట్టుకొని "సుందరీ కూరలు తరిగావుటే అమ్మాయ్!" అని కేకవేసింది.

## ౧౩

కాంతం వంటచేసుకొంటూఉన్న సమయంలోనే రఘు వచ్చి "అమ్మా, తమ్ముడు వస్తున్నానని ఉత్తరం వ్రాశాడే" అని చెప్పాడు.

రాధబాబు చదువుకొంటున్నాడు బస్తీలో. సెలవలు ఇచ్చారు. ఇంటికి వస్తున్నాడు, అదీసంగతి.

"ఎప్పుడు వస్తాడురా నాయినా ?"

"ఇవ్వాళ పదిగంటల బండికి వస్తాడుట !"

"నేను అనుకొంటూనే ఉన్నా. వస్తున్నాడూ. మా తండ్రిని చూచి మూడు నెలలు దాటింది. అరే పెద్దబాబూ, నీవు వాడికోసం స్టేషనుకు వెడతావుగదూ ! ఆఫీసుకు కాస్త ఆలస్యంగా వెళ్ళితే వెళ్ళావులే !" అని పెద్ద కొడుకుతో చెప్పింది కాంతం. ఆమె తన సంతోషాన్ని అణచుకో లేకుండా ఉంది. ఆమె ప్రాణమార్గములో అమృత ప్రవాహములు సుళ్లు తిరిగినవి.

రాధబాబు వస్తూఉన్న సంగతి అందరికీ చెప్పందే ఆమెకు తోచలేదు. 'మీా చిన్న అన్నయ్య వస్తున్నాడే పది గంటల బండికి !' అని జయతో చెప్పింది. సుందరితో చెప్పింది 'మీా మరది వస్తున్నాడే కోడలా'. అని. ముందు గదిలోకి వెళ్ళి "చిన్నబాబు వస్తున్నాడట విన్నారా" అని ముసలాయనతో అన్నది. చివరకు పెద్ద శేషుతో కూడా చెప్పింది, 'మీా మామయ్య వస్తున్నాడే తల్లి' అని ! శేషు మామయ్య, మామయ్య అంటూ ఇల్లంతా గంతులు వేసింది.

కాంతం మనస్సు కొడుకుకోసం ఆరాటపడి పోయింది. గొల్లదాన్ని ఇంకొక శేడపెరుగు ఎక్కువగా పోయమన్నది. "ఎందుకమ్మా ఎక్కువ పోయించుకొంటున్నావు ?" అని అది అడిగితే కాంతం సంతోషాన్ని అణచుకొని "మా చినబాబు వస్తున్నాడే పదిగంటల బండికి!" అన్నది. అదికూడా సంతో

పించి "నీకేం తల్లీ. అదృష్టవంతురాలవు. పెద్దకొడుకు సంపాదించి చేతిలో పోస్తున్నాడు. రేపు చిన్నకొడుకు ఎక్కి వస్తాడు. ఈ ఇద్దరి సంపాదనతో దోసెలి నిండుతుంది" అన్నది. కాంతం విపరీతమైన ఆనందంతో పొంగిపోయి, "అదంతా భగవంతుడి దయ మాహాలక్ష్మీ, మనది ఏముంది చెప్పు. ఈ చిన్నవాడి పెళ్ళికూడా చేశానా, ఇక నేను చేయవలసింది ఏమీ ఉండదు. వాణ్ణి ఒక ఇంటివాణ్ణిచేసి వెళ్ళిపోవాలని ఉంది" అన్నది.

"అల్లా అనబోకు తల్లీ. ఏమంత పెద్దదానవు అయినావని అల్లాగ అనుకోవలె అమ్మా!" అన్నది ఆ గొల్లది.

కాంతం అన్నది, "పెద్దదాన్ని కాకేం! పెద్దదాన్నే మహాలక్ష్మమ్మ! ఎన్నాళ్ళని ఈ సంసారములో కూరుకుపోవడం! పిల్లవాడి పెళ్ళిచూచి నేను కాశీకి వెళ్ళిపోవాలనుకొంటున్నానే మహాలక్ష్మమ్మ!" అని తన మనస్సులోని కోరికను గొల్లదానికి రహస్యంగా చెప్పింది.

అక్కడే నిలుచుని ఈ మాటలన్నీ వింటూ ఉన్న సుందరి, విరగబడి నవ్వింది. "ఎందుకూ, కోడలమ్మ నవ్వుతుంది?" అని అడిగింది గొల్లమనిషి. దానికి ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. కాంతంకూడా కొద్దిగా నవ్వుకొని మాట్లాడలేదు. గొల్లదానికి సంగతి ఏమిటో తెలియక సుందరినే అడిగింది, "ఎందుకమ్మా అల్లాగ నవ్వుతావూ?" అని. సుందరి నవ్వు ఆపుకొని "మా అత్తగారు కాశీకి వెళతాను అన్నప్పు

డల్లా నాకు నవ్వు వస్తుంది మహాలక్ష్మీ" అన్నది. మహాలక్ష్మికి ఏమీ బోధపడక ఊరికే నవ్వి వెళ్ళిపోయింది.

అది వెళ్ళిపోయిన తరువాత కాంతం అడిగింది సుందరిని "ఎందుకే అమ్మాయ్ నవ్వావూ?" అని.

"ఎందుకూ లేదు అత్తయ్యా"

"నేను కాశీకి వెళ్ళను అనేగా నీ ఉద్దేశం?"

"ఎందుకు వెళ్ళరూ! తప్పకుండా వెళ్ళుతారు. మీరు రామేశ్వరంకూడా వెళ్ళుతారు అత్తయ్యా!" అని విరగబడి నవ్వింది సుందరి.

కాంతానికికూడా నవ్వు వస్తూనే ఉంది. ముందు పెద్ద మనవణ్ణి చూడాలా! ఆ తరువాత చిన్నకోడలు వస్తుంది. ఆ కొత్తకోడలు చప్పున పిల్లలను కన్నా ముందు ఆడపిల్లే పుట్టిందా మళ్ళీ చిన్న మనవణ్ణి చూసినదాకా ప్రాణం పీకుతుంది. ఎప్పటికి తాను కాశీకి వెళ్ళడము!

ఇల్లాగ అనుకొని, కాంతం తనలో తాను నవ్వుకొని సుందరితో అన్నది, "నాకు తెలుసునే పిల్లా, నీవు ఎందుకు నవ్వుతున్నదీని! కాని నేను కాశీకి వెళ్ళేమాట ఎట్లాగూ నిజమే!"

సుందరి పరిహాసంగా అన్నది, "ఆఁ అన్నీ వెళ్ళారులెండి. మీరు వెళ్ళకుండా ఉండటానికి నేను శాయశక్తులా పాటుపడతాను. నా చెల్లెలుకుకూడా బోధిస్తాను ఆ రహస్యం!" అని పకపకలు పెట్టుకొని నవ్వింది.

పది కావచ్చే సమయానికి చిన్న శేషునూ పెద్ద శేషునూ వెంటబెట్టుకొని రఘు స్టేషనుకు వెళ్ళాడు. రాధ బాబు రైలు పెట్టె కిటికీలోనుంచి చూస్తూనే ఉన్నాడు. పెద్దశేషు "మామయ్యా!" అని కేక వేసి ముందుకు పరుగెత్తింది. బాబు పెట్టే బెడ్డింగు, రెండు బుట్టలూ దింపి, తానుకూడా దిగాడు. ముందు పెద్దశేషుని ఎత్తుకొని ముద్దాడాడు. దాన్ని దింపి చిన్న శేషుని ఎత్తుకొన్నాడు. పెద్దశేషు మామయ్య పక్కనే నడిచింది. కూలివాడు సామాను ఎత్తుకొని ముందు నడిచాడు.

వీధి గుమ్మంలో తల్లి, వదినగారు, చెల్లెలు ముసలా యన అంతా నుంచుని తనకోసం ఎదురుచూస్తూ ఉండడం బాబు చూశాడు. బాబు వచ్చేరావడంతోనే తల్లిదగ్గరకు వెళ్ళి "అమ్మా!" అన్నాడు. కాంతం రాధబాబును తలపైని నిమురుతూ, మనస్సులో ఎంతో కష్టపడుతూ ఉన్నదానివలెచూస్తూ "ఇదేమిటిరా, నాయినా, ఇట్లా ఉన్నావేమిరా!" అంటూ బాబు బుజాలూ, చేతులూ, అన్నీ ప్రేమతో నిమిరి చూచుకొన్నది. "పేపర్లు బాగా వ్రాశావురా నాయినా?" అని తండ్రి అడిగాడు. "బాగానే వ్రాశాను నాన్నా" అన్నాడు బాబు. ఇంతలో సుందరి కాళ్లు కడుక్కోను నీళ్లు తీసికొచ్చియిచ్చింది. "స్నానాల గదిలోకి రారా అన్నయ్యా, అక్కడే కాళ్ళు కడుక్కోవచ్చు" అన్నది జయ. రాధబాబు స్నానంకూడా పూర్తిచేసి వదినగారు ఇచ్చిన కాఫీ తాగుతూ తల్లి దగ్గర సీట మీద కూర్చుని కబుర్లు చెప్పటం సాగించాడు.

కుమారునివంక చూచి, "నాయినా చిక్కిపోయినా వేమిరా. బొత్తిగా ఇట్లా అయిపోయినావు! ఆ జుట్టు అల్లాగ పెంచుకున్నావేమిరా!" అని కాంతం ఎన్నిసార్లు అన్నదో లెక్కలేదు. హోటలులో తిండి సరిగ్గాలేక కొడుకు చిక్కిపోయి నాడట! అదీ ఆమె అనడం! జయా సుందరీకూడా ఈ మాటలు విని ఊంహు నవ్వుకొన్నారు.

కాంతం ఈ చిన్న కొడుకుకు విస్తర్లో అన్నం పెట్టి మూడు నెలలు అయింది. ఇవ్వాళ ఆమెగారు సంతోషం తోనూ, తృప్తితోనూ కుమారునికి అన్నం పెట్టుకొన్నది. ఆమె హృదయంలో ప్రేమ వెల్లువలై పారింది. బాబు తల్లి పెట్టగాతిని ఎన్ని రోజులో అయింది. ఆ రోజు బాబు తృప్తిగా భోజనం చేస్తున్నాడు. తల్లి మృదుహస్త స్పర్శవలన అతని దేహం బహుతేలిక అయింది. సౌందర్య ప్రవాహ సమా క్రాంత స్వర్గరోచిస్కమైన మాతృమూర్తిని చూచుకొని, బాబు మనస్సులో భగవంతుణ్ణి ధ్యానించి "ఈ భాగ్యం అంద రికీ ఉంటుందా!" అనుకొన్నాడు.

## ౧౪

వృద్ధసలాయనకు అరవై సంవత్సముల వయస్సు. ఇప్ప టికి యాభై సంవత్సరాలక్రింద ఆయన కాంతాన్ని వివాహం చేసుకొన్నాడు. ఆయన ఏమీ వరించి వివాహం చేసుకోలేదు. ఆయన తండ్రిగారు కూర్చోమంటే కూర్చుని ఆ పిల్లమెళ్ళో

మూడు ముళ్ళూ వేశాడు. అంతకంటే ఆయనకు ఏమీ తెలియదు.

తాతగారికి అరవైయ్యో యేట మళ్ళీ యౌవనం వచ్చింది. ఆయన పడకగది ఆయనదే. అందు ఒక మంచముపై పరుపు వేసికొని దానిపైన తెల్లని దుప్పటి పరుచుకొని ఆయన పడుకుంటాడు. ముగ్గుబుట్టలాగ తల నెరిసింది. ఆయన శయ్య సుగంధద్రవ్య పరిమళ శోభితమై ఉంటుంది ఇప్పటికిని! ముప్పది ఏండ్ల లోకారాధనీయ దాంపత్యసౌఖ్యమును నెమరు వేసుకొంటూ ఉంటాడు ఆయన.

ఆయన గదిలోకి కాంతంగాని కోడలుగాని సాధారణంగా వెళ్ళరు. ఆయన మనుమరాళ్ళూ, వాళ్ళ ఈడుపిల్లలు, ఇంకా ఇద్దరు ముగ్గురున్నారు; వాళ్ళు తాతగారి గదిలోకి వస్తూ ఉంటారు. వాళ్ళు మంచంపైకి ఎక్కి—తొక్కి—నా ముసలాయన ఏమీ అనడు. ఎందుకంటే వాళ్ళంతా ఆయన ప్రియురాండ్రు.

"నన్ను పెళ్ళిచేసుకొంటావా తల్లీ?" అంటాడు ఆయన. వాళ్ళంతా "చేసుకొంటాము" అంటారు ఏకకంఠంతో. ఆ పసిపిల్లలు నిష్కల్మష హృదయాలతో తాతగారిని ప్రేమించి పెళ్ళాడడానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళందరినీ చేసుకొన్నా తాతగారికి వచ్చిన ఇబ్బంది ఏమీ లేనట్లే కనపడుతుంది. ఒకరినిచూస్తే ఒకరికి ఈర్ష్య లేదు. అందరూ తాతకు సేవచేస్తారు. ఒకతె ఆయనకు తలంటుతుంది. మరొకతే మీసాలు సవ

రిస్తుంది. ఆయన తృప్తిగా అందరినీ బహిరంగంగా ముద్దెట్టు కొంటాడు. ఆ పెద్దశేషు తాతను మరీ తొందరపెడుతున్నది పెళ్ళిచేసుకోమని. "తాతయ్యా రేపే మనపెళ్ళి. మల్లెపూలు తీసుకొని రావూ!" అంటుంది. పిల్లలంతా కాసేపు ఆయన జుట్టు పీకి, మీసాలులాగి వెళ్ళిపోతూ ఉంటారు.

కాంతం ఆ రోజున అన్నది, "మీ భోజనం అయింది కాబట్టి, వెన్నెలలో మనుమరాలును పెట్టుకొని పడుకోండి. నేను అట్లా వెళ్ళివస్తాను."

"ఎక్కడికి?" అన్నాడు ముసలాయన విసుగ్గా.

"ఎక్కడికీ లేదండీ. మనసావిత్రి కబురుచేసింది. కాసేపు కూర్చుని వస్తాను."

"ఎవరూ?"

"ఎవరేమిటండీ. మీ కూతురు సావిత్రి. దాని మొగుడు ఆలస్యంగా ఇంటికి వస్తున్నాడట కాసేపు కూర్చునిపో, ఆ అమ్మ, ఒక్కర్తెను ఉండలేను అన్నది. కాసేపు ఉండివస్తాను. మీరు మనుమరాలుతో కాలం గడపండి" అనిచెప్పి కాంతం వెళ్ళిపోయింది.

పూర్వపు రోజులలో కాంతం భర్తను వదిలి ఎక్కడికీ వెళ్ళేదికాదు. ఇప్పుడు అల్లాగకాదు. ఏ కూతురో పిలుస్తుంది, వెడుతుంది. ఏకోడలో రమ్మంటుంది, వెడుతుంది. ఆ పేటలో ఉన్నవాళ్ళంతా కాంతానికి కూతుళ్ళూ, కోడళ్ళూ! కాస్త

పెద్దవయస్సు వాళ్ళంతా వదినెలు ! కాంతం ఆ పేటను అంతా ఒక సంసారంగా మార్చింది. కొత్తవాళ్ళు ఎవరైనా వచ్చినా సులభంగా ఈ సమిష్టి కుటుంబంలో చేరిపోతారు.

కాంతం ఇంటికి ఎవరైనా బంధుగులు వస్తే ఆ సంగతి పేటంతా ఇట్టే తెలిసి పోతుంది. కులభేదాలతో పనిలేదు. కాంతానికి అందరూ ఒకటే !

ఒక రోజున కాంతం తమ్ముడు వచ్చాడు. ఈ సంగతి అందరికీ ఇట్టే తెలిసిపోయింది. చిట్టెమ్మ వచ్చి "ఎవరత్తా వచ్చింది?" అని అడిగింది. "మీ బాబాయి వచ్చాడు కోడలా" అన్నది కాంతం. "బాబాయి వచ్చాడా అత్తా! ఆ సంగతి నాకు కాస్త కబురుచేస్తే నీ సొమ్ము ఏమి పోయిందమ్మా అత్తా !"అని గబగబా ఇంటికివెళ్ళి గడ్డపెరుగు తెచ్చి "బాబాయికి వెయ్యి అత్తా !" అని కాంతానికి ఇచ్చింది.

కాంతం అన్నది, "ఎందుకమ్మా కోడలా ? చీకటిపడ్డది కదా, పనివేళా దీనికోసం రావాలా చెప్పు ? ఏమంత మునిగి పోయిందని వచ్చావమ్మా ! అని కోప్పడ్డది. "బాబాయివస్తే ఎట్లా రాకుండా ఉండేది అత్తా ! రాకుండా ఉండగలనా ! ప్రాణం పీకదూ !" అన్నది చిట్టెమ్మ. ఇంతలో రఘు వచ్చి "ఏం చిట్టెమ్మ వదినా, నీ మాటలు వింటూనే ఉన్నాను. పెరుగంతా మీ బాబాయికేనా, నాకేమన్నా తెచ్చావా ?" అన్నాడు.

రఘు చిట్టెమ్మకు బావగారి వరసగా, అందుకని చిట్టెమ్మ కాస్త సిగ్గుపడి, తలుపుపక్కగా నుంచుని "బావగారికి

కూడా మీగడ పెరుగు వేస్తే ఇంక పట్టు పగ్గాలుంటాయా ఏమిటి ?" అని సరసమాడి "వెడతాను అత్తా" అన్నది. చిట్టెమ్మకు సిగ్గురావటం చూశాలాన ఆ పిల్ల నడకలోనికి వయ్యారపు తనము వచ్చింది. అదిచూచి కాంతం అన్నది, "జాగ్రత్తగా వెళ్ళవే కోడలా, దారిలో ఎవరైనా కనపడి చంక నేసుకు పోగలరు." ఈ మాటలువిని చిట్టెమ్మ మరీ సిగ్గు పడి తలవంచుకు వెళ్ళిపోతూఉంటే ఏదో అనిర్వచనీయమైన ఆ సద్భావము కాంతం హృదయంలో చిగురించగా, ఒక ఆనందరేఖ ఆమె మొగముపైకి వచ్చింది. ఆమె అన్నది, "బంగారుతల్లి చిట్టెమ్మ !" అని.

మరునాడు చిట్టెమ్మ అందరితోనూ చెప్పింది తన బాబాయి వచ్చాడని "ఏ బాబాయి ?" అని అడిగింది నాగమ్మ. కాంతం అత్తయ్యకు తమ్ముడైతే నాకు బాబాయికాక ఇంకే మవుతాడు ! అని చిట్టెమ్మ ఆశ్చర్యాన్ని ప్రకటించింది. "ఎల్లెల్లా నాకు చెప్పావు కావేం, వదినా!" అంటూ నాగమ్మ చరచరా ఇంటికి వెళ్ళి దొడ్లో నాలుగు పొట్లపిందెలుంటే అవి కోసి చేత్తో పట్టుకుని కాంతం ఇంటికివచ్చి "పిన్నీ" అని పిల చింది. 'ఎందుకే నాగులూ' అన్నది కాంతం.

కాంతం నాగమ్మను నాగులూ అని పిలుస్తుంది. ఒకసారి చిట్టెమ్మ అడిగింది కాంతాన్ని- "ఏం అత్తా నన్నేమో చిట్టెమ్మా అంటావు. దాన్నేమో నాగులూ అని పిలుస్తావు. దాన్నే ఎక్కువ చనువుగా పిలిచినట్లు కాలేదా ఏమిటి ! అది

ఎక్కువా నీకు ?" అని గుసుపుగా అడిగింది కాస్త విచారంతో.
కాంతం అన్నది, "దానిమీద ఉన్నచనువు నీమీద ఎట్లా ఉంటుందే ! అదేమో కూతురాయె ! నీవు ఎట్లాగయినా కోడలువాయె ! కూతురును పిలిచినంత చనువుగా కోడలును పిలుస్తారా ఏమిటి ! ఈ మాత్రానికి అది ఎక్కువ కావటం ఏముందే పిల్లా !" నాగమ్మ గర్వంతో పొంగిపోయింది.

ఆ రోజున నాగమ్మ వచ్చి పిన్నీ అని పిలచినపుడు కాంతం లోపలనుంచే "ఉండు అమ్మాయ్ తులసిపూజ చేసు కొంటున్నాను" అని కేకేసి ఊరుకొన్నది.

నాగులు బావిదగ్గరున్న బండపై చతికిలబడ్డది. అటు నుంచి సుందరి వచ్చి నాగమ్మను చూచి "ఏం వదినా ఇల్లా వచ్చావు ?" అన్నది.

"ఏమీలేదు వదినా, మా మామయ్య వచ్చాడటగా. దొడ్లో రెండు పొట్లపిందెలు ఉంటే ఇచ్చిపోదామని వచ్చాను. పిన్ని పూజ చేసుకొంటూన్నది. నీవు తీసుకోరాదవమ్మా వెడ తాను" అన్నది.

కులం ఒకటి కాకపోతేనేం ! అత్తా, పిన్నీ, వదినా అని ప్రేమగా పిల్చుకొని అన్యోన్యంగా ఉండడానికి కులభేదాలు ఏమీ అడ్డురావు. అల్లాంటప్పుడు కులద్వేషాలు ఎందుకు పెరుగుతున్నవో కాంతానికి అర్థం కాలేదు.

ఇంతలో కాంతం పూజ పూర్తిచేసుకొని, బైటికివచ్చి నాగులుచేతిలో ఒక కొబ్బరిచిప్ప పెట్టి "ప్రసాదం పుచ్చుకో

నాగులూ" అన్నది. నాగమ్మ ప్రసాదం కళ్ళకు అద్దుకొని వెళ్ళిపోయింది.

చిన్నతనంలో ఆదర్శపత్నిగా పేరొందిన కాంతం, ఇప్పుడు లోకారాధనీయమైన పత్నియేకాక కొందరికి పిన్ని, కొందరికి అత్త, కొందరికి వదిన, మరికొందరికి బామ్మ అయింది. పూర్వజన్మసుకృత సంస్కారం చేత ఆమె అందరినీ ప్రేమించగల్గుతున్నది.

౧౩

ఒకరోజున శీను వచ్చాడు. రఘు ఆ కుఱ్ఱవాడిని ఎప్పుడూ చూడలేదు. తన ఇంటిపేరూ, తండ్రిపేరు చెప్పినా కూడా రఘు గ్రహించలేక వెళ్ళి తల్లితో చెప్పి, "ఎవరే అమ్మా ఆ అబ్బాయి?" అని అడిగాడు.

కాంతం గబగబా వీధి గదిలోనికివచ్చి కాస్త నిదానించి చూచి "ఎవరు నాయినా నీవు?" అన్నది.

"మా నాన్న మీ ఇంటికెళ్ళి చూచిరమ్మన్నాడు" అని తన తండ్రి పేరూ, తల్లి పేరూ చెప్పాడు ఆ పిల్లవాడు.

ఒకక్షణం నిశ్చేష్టురాలయి, కాంతం చటుక్కున జ్ఞాపకం వచ్చింది కాబోలు, ఒక్క అడుగులో పిల్లవాడి దగ్గరకు వెళ్ళి మడికట్టుకొని ఉన్నానని సంకోచించకుండా, వాణ్ణి దగ్గరకు తీసికొని, "గంగమ్మ కొడుకువురా, నాయినా, నిన్ను చూచి ఎన్నాళ్ళయిందో! పాపిష్టిదాన్ని. మా తండ్రే! ఎప్పుడు వచ్చావురా నాయినా?" అన్నది.

'నిన్న' అన్నాడు ఆ అబ్బాయి.

"నిన్న అనగా వచ్చి ఇప్పుడురా నాయినా వచ్చావు మీా అత్తయ్యను చూడడానికి ! అల్లాగ చేయవచ్చునాబాబు ? నీకేం ఖర్మంరా ఎక్కడికో వెళ్ళటానికి అత్తయ్యను నేను ఉండగా ! పిచ్చిబాబూ ! పిచ్చిబాబు !" అని కాంతం వాణ్ణి మనసారా కౌగలించుకొని, బుజాలుతడిమి, తలనిమిరి, వీపు దువ్వి, క్రాపింగు సవరించి, మునిగడ్డం పట్టుకొని బాష్పపూరిత నేత్రియై "నాయినా అమ్మ జ్ఞాపకం ఉందిరా నీకు ?" అని అడిగింది కంపిస్తూఉన్న కంఠంతో. శీనుకుకూడా కళ్ళనిండా నీళ్ళు వచ్చినయి. శోకగాద్గదికమును అదుపులో పెట్టుకొని ఆ కుఱ్ఱవాడు "లేదు" అని ఒక్క మాటమాత్రం అనగలిగాడు. కాంతం బొటబొటా కన్నీరు కార్చింది. వాడి తల్లి పోయి అప్పటికి పదేండ్లు అయింది. కాంతం శీనును గట్టిగా కౌగలించుకొని "అవును నాయనా మీా అమ్మపోయేనాటికి నీవు అయిదేండ్ల వాడివేగా ! నీకెట్లా జ్ఞాపకం ఉంటుందితే" అని ఓదార్చింది. ఎక్కడో ఆ కుఱ్ఱవాడి హృదయంలో దాగివున్న శోకాన్ని ఈ ఓదార్పుమాటలు పైకిలాగినయి. ఆ బిడ్డ బొళబొళా కన్నీరు కార్చాడు. కాంతం వాడిని హృదయానికి మరింత దగ్గరగా తీసికొని ఇంకేవో ప్రశ్నలు అడిగి ఆ విషయం మరచిపోయేలాగున చేసింది.

చివరకు కాంతం రఘుపే ప్రకుతిరిగి "శీను నీకు బావ అవుతాడురా నాయనా, పరాయివాడు కాదురా !" అని చెప్పి,

శీనువైపు తిరిగి, "బావతో మాట్లాడుతూ కూర్చో నాయనా వంటకాగానే పిలుస్తాను వద్దువుగాని" అని కళ్ళనీళ్లు తుడుచు కొంటూ వెళ్లింది.

రఘు తల్లి వెంటనే వంటయింట్లోకిపోయి "ఆ అబ్బాయి నాకు బావ ఎట్లా అవుతాడు" అని అడిగాడు.

నీకు తెలియదురా నాయినా. బావగాక ఇంకేమి అవు తాడురా! వాడితల్లీని. మీ నాన్నానూ అప్పచెల్లెంద్ర బిడ్డ లురా" అని చెప్పింది.

రఘూకు ఇదేదో దూరపు బంధుత్వం అనిపించింది. ఇంతదూరపు బంధువు కనిపిస్తే, తనతల్లి ఇంత ఆదరణ చూపు తుందేమా అని అతనికి ఆశ్చర్యం కలిగింది.

పాల పున్నమ్మ అక్కడేనుంచుని చూస్తున్నది, "ఎవరు నాయినా ఆ అబ్బాయి?" అని రఘూను అడిగింది. రఘు నవ్వి, "ఎవరో దూరపుబంధువు!" అన్నాడు.

రఘు ఎందుకు నవ్వాడో పున్నమ్మ గ్రహించి అన్నదీ, "కాంతమ్మ తల్లికి దూరపు బంధువు అంటూ లేదు నాయినా! ఆమెకు కడుపు నిండా ప్రేమే! అయినా ఒక సంగతి. దేముడికి దూరపు బంధువులుంటారా నాయినా! అమ్మ సంగతీ అంతే!" పున్నమ్మ ఈ మాటలు అని కన్నీళ్లు తుడుచుకొన్నది. రఘు ఒడలు పులకలెత్తింది. అతడు కళ్ళుమూసికొని ఏదో ధ్యానం చేస్తూ ఉండిపోయినాడు.

* * *

కాంతం ఆ రోజున జయమ్మకు తలంటిపోసింది. పెద్ద శేషు, చిన్న శేషు, రవి అంతా తలంటి పోసుకొన్నారు. మధ్యాహ్నం నాలుగుగంటల బండికి జయ తెనాలి వెడుతున్నది. మొగుడు ఉత్తరం వ్రాశాడు పెళ్లాన్ని వెంటనే పంపమని !

కూతురు అత్తగారింటికి వెడుతూఉంటే కాంతానికి కష్టంగా ఉంది. అందుకనే అన్నదీ, "అమ్మాయ్ ఉత్తరం వ్రాస్తే, వ్రాశాడులేవే ! ఇంకో నాలుగురోజులు అయిన తరువాత వెళ్ళవచ్చులే ! అప్పుడే వెళ్ళడం నాకేమీ బాగుండలేదే తల్లి !"

"అసలు ఆయన మొదటనే చెప్పాడు నాలుగు రోజుల కంటే ఎక్కువ ఉండవద్దు అని, వచ్చి పదిరోజులు అయిందా, ఇక వెళ్ళకపోతే బాగుండదే అమ్మా, ఆయనకు కోపంకూడా వస్తుంది" అన్నది జయ.

కాంతం కంపిస్తూ ఉన్న కంఠంతో అన్నదీ; "ఈ మాత్రానికే కోపంరావాలే ఏమిటే; వచ్చినదానివు వచ్చినట్లే వెళ్ళుతుంటివి ! ఏమిరావటం ఏమిపోవటం ఇది ?"

"నీకు అట్లాగే ఉంటుంది. వెళ్లకపోతే మాటదక్కదు. వెళ్లనీయ్" అన్నది జయ.

'ఆడపిల్లలు ఇంతేకదా, ఎట్లాగయినా ప్రాణాలన్నీ మొగుడుమీదే ఉంటవి ఎక్కడున్నా' అని తనలో తాను అను

కొని కూతురు ప్రయాణానికి సన్నాహాలు ప్రారంభించింది కాంతం.

సాయంత్రం నాలుగు గంటల బండికి ప్రయాణం పెట్టుకొని, ప్రొద్దుగూకులూ తల్లీ కూతురూ కూడా సన్నాహాలు చేస్తూనే ఉన్నారు.

మూడున్నరకు పెట్టా బేడా సర్దుకొనడం చాలవరకు పూర్తి అయింది. "తెమలవే పాపా, బండీకి టైము అయింది" అన్నాడు రఘు. సుందరి వదిన కాళ్లకు పసుపు పూసి ముఖాన బొట్టుపెట్టింది. ముసలాయన పెట్టెలోనుంచి చీరా, రవికా తీసుకొనివచ్చి సుందరిచేత జయకు ఇప్పించాడు. జయ ఆ చీరను పెట్టెలో పెట్టబోతూఉంటే కట్టుకోవే తల్లీ అన్నది కాంతం.

జయ చీరగట్టుకొని బంగారు తల్లిలాగ వచ్చి తల్లికీ తండ్రికి పాదాభివందనం చేసి వెళ్లిరానా అన్నట్లు చూచింది. కుమార్తె చెక్కిళ్లుతాకి వెళ్లివస్తావా తల్లీ అన్నది కాంతం గద్గదిక జెందిన కంఠంతో. జయ కళ్లుకూడా చెమ్మగిల్లినవి.

టైము అయిపోతున్నదని రఘు తొందర పెట్టాడు. వాకిట్లో జట్కా వాడుకూడా తొందర పడుతున్నాడు. జయమ్మ వెళ్లలేక వెళ్లలేక తల్లితండ్రుల దగ్గర సెలవు తీసికొని బండెక్కి కూర్చున్నది. జయ ముఖంలో సంతోషమూ దుఃఖమూ అర్ధనారీశ్వరాత్మ్యమును పొందినవి. బండి కదలబోయేముందు కాంతం జయచేతులో నాలుగు రూపాయలు

పెట్టి, "తీసుకో తల్లీ, ఎందుకైనా ఉంటుంది. అనవసరంగా ఖర్చు చేయకమ్మా" అని చెప్పి, రవిని మరొకసారి ముద్దాడి పెద్ద శేషును బుగ్గగిల్లి, "అమ్మా జాగ్రత్తగా వెళ్లిరా అమ్మా" అని వెనక్కు తగ్గింది.

జయ బండిఎక్కి కూర్చుని తల్లివంకా తండ్రివంకా దీనంగాచూచి "వెళ్లివస్తానే అమ్మా, వెళ్లివస్తా నాన్నా" అన్నది రుద్ధకంఠంతో. కాంతం పమిటచెంగు కళ్లకు అద్దుకొని "వెళ్లిరా అమ్మా" అన్నది.

"ఉత్తరం వ్రాస్తుండవే తల్లీ !" అన్నాడు ముసలాయన. జయకూడా చెక్కిళ్లపైకి జారుతున్న కన్నీళ్లను తుడుచుకొన్నది.

కాంతం ముసలాయనా కూడా అక్కడే నుంచున్నారు. సుందరి వాళ్ళకు కాస్త దూరంగా నుంచుని "ఉంటాను" వదినా అన్నది. కాంతం రవిని జాగ్రత్తగా చూడమనీ, శేషుకు రోజూ నీళ్ళుపోయమనీ బద్ధకించవద్దనీ, ఏవో ఇల్లాటి మాటలు చెప్పినవే చెప్పుతూఉంటే ఇకపోనీ అని రఘు మళ్ళీ అనడమూ జట్కా కదలటమూ జరిగింది. వృద్ధదంపతులు కాసేపు అక్కడే చూస్తూ నిలబడి ఉండి, బండి మలుపుతిరిగిన తరువాత వసారాలోకి వెళ్ళి నుంచున్నారు.

భార్యాభర్తలు, అయిన ఆ వృద్ధులు ఇద్దరూ కూడా జయమ్మను మనస్సులో దీవించారు. ఆ దీవనలోనే వారి

హృదయవీణలు ఏకశ్రుతిని పొందినవి. భార్యాభర్తలు ఏకం కావడం అంటే అదే కదా !

దంపతులు ఇద్దరూ వసారాలో నుంచుని రైలు కదలడాన్ని చూస్తున్నారు. బస్ బస్ మని రైలు కదిలి, "జయమ్మను తీసికెళ్ళి తెనాలిలో సుఖంగా దిగవిడుస్తాను. మీరేమీ ఆదుర్దా పడకండి" అనిగట్టిగా కూతవేసి చెప్పి గెంతుకుంటూ వెళ్ళిపోయింది.

కాంతం మరుక్షణంలో తెప్పరిల్లి సుందరినిపిలిచి చెప్పింది "సుందరీ నాలుగు దాటిందికదా, నీవు ఇంకా అట్లాగే ఉన్నావేమే పిల్లా ! పో తలదువ్వుకొని పూలుపెట్టుకో" అన్నది. కాంతం చిన్న శేషుని ఎత్తుకొని కాసేపు ముద్దాడి, తరువాత దింపి తలదువ్వి రెండు జడలువేసి పూలు పెట్టింది.

ఇంతలో చీకటిపడింది. గంగా యమునలు కలిసినట్లు చీకటి, వెన్నెలల సంగమమైంది.

అటు తరువాత గంపెడు సంసారంతో పిల్లల నందరినీ వెంటబెట్టుకొని చంద్రబింబం ఆకాశవీధిలోకి వచ్చింది.

కాంతం మనుమరాలును చంకనేసుకుని సుందరిని పిలిచి అన్నది, "ఇదిగో, కోడలా నేను శివాలయంలోకి వెళ్ళివస్తాను. నీవు స్నానంచేసి, తెల్లచీర కట్టు." ఆ తరువాత కాంతం మందగమనంతో శివాలయం వైపు నడిచింది.

ఇల్లాగే కాలం గడుస్తున్నది.

రఘు సంసారం భారం అంతా నెత్తినవేసుకొని ఈదు తున్నాడు.

దసరాపండుగ నాలుగురోజులు ఉన్నది అనంగా రఘు తల్లిదగ్గరకొచ్చి, ఎదురుగా కూర్చుని, "అమ్మా పండుగకు నీకు మంచిచీరకొని ఇయ్యాలని ఉన్నదే. ఏంచీర కొనమంటావే!" అని అడిగాడు, ఏదో ఆనందాన్ని పొందుతూ.

"ఏదోచీరకొనరా నాయినా ఏచీర అయితేనేం ?"

కనకాంబరం జరీచీర కొనుక్కురానా-?"

"జరీచీరలు నా కెందుకురా నాయినా ! ఏదికట్టుకొన్నా వెళ్ళిపోతుంది పండుగ ! కోడలుకుమాత్రం కాస్త ఖరీదుగలది కొనుక్కురా. చిన్నపిల్ల దానికి ఏ చీరమీద మనస్సుపోతే ఆచీరకొను. నాకు ఏదైతేనేమిలే" అన్నది కాంతం కొడుకుతో.

రఘు ఆ సాయంత్రమే రెండు జరీచీరలు కొనుక్కొచ్చి తల్లిచేతికిచ్చాడు. వాటిలో మబ్బురంగుచీర తానుంచుకొని కనకాంబరచీర కోడలుకు ఇచ్చింది కాంతం.

పండుగపూట కోడలు జరీచీర కట్టుకొని తలలో పూలు పెట్టుకొనివచ్చి మామగారికీ అత్తగారికీ పాదాభివందనం చేసింది.

కాంతానికి కడుపునిండినట్లు అయింది. కుందనపు బొమ్మ లాగుంది సుందరి. ఆ పిల్ల అందాన్ని చూచి కాంతం మురిసి పోయింది.

సుందరి వయ్యారంగా నడుస్తూ తన పడకగదిలోకి వెళ్ళి, కిటికీలోనుంచి వంటింటివైపు చూచింది. రఘు తల్లితో మాట్లాడుతున్నాడు. తన ఉద్దేశం గ్రహించి తన వెనువెంటనే రఘువస్తాడని సుందరి అనుకొన్నది. కాని రఘుకు ఈ దృష్టే లేదు. తల్లిదగ్గర కూర్చుని లేవలేదు.

సుందరి శేషుకుకూడా క్రొత్తగుడ్డలు తొడిగి, తండ్రి దగ్గరకు పంపించింది. కాంతం శేషును ఎత్తుకొని తనివితీర ముద్దాడింది.

రఘూను తనగదిలోకి రప్పించడము ఎట్లాగా అని సుందరి చాలాసేపు ఆలోచించింది. ఆ పిల్లకు ఏ ఉపాయమూ తోచలేదు. తనసౌందర్యము భర్తకు ఏకాంతములో చూపాలని సుందరి ప్రయత్నిస్తున్నది.

రఘు ఈ సంగతి తెలుసుకోలేక అక్కడే ఉండిపోయి నాడు. సుందరి కొద్దిగా దగ్గింది. రఘు గ్రహించలేదు. ఆవ లించి చిటిక వేసింది. రఘుకు వినిపించలేదు. చివరకు శేషును పిలిచింది, "శేషూ ఇటు రావే ఒకసారి అని" కోడలు ఆంత ర్యము గ్రహించి కాంతం "నాయినా పెద్దబాబూ అమ్మాయిని తీసికెళ్ళి తల్లికిచ్చిరారా" అన్నది.

"పంపించవే అదే వెళ్ళుతుంది"అన్నాడు రఘు అమాయికంగా. కాంతం శేషును కొడుక్కుయిచ్చి "ఇవ్వాళ పండుగ కాదురా నాయినా దానిని నడువనీయ కూడదు" అని గదిలోకి పంపించింది.

సుందరి చీర సర్దుకొని పమిట చెంగుతీసి నడుముకు బిగించుకొని వయ్యారం ఒలకపోస్తూ భర్త ఎదుగుగా నుంచున్నది నాట్యసుందరిలాగ.

రఘు సుందరి అందాన్ని చూచి లోలోన మురిసిపోయినాడు. అతనికి సుందరిని తన కౌగిలిలోకి తీసికొని ముద్దాడాలని అనిపించింది కాని అది మర్యాదకాదని ఊరుకొన్నాడు.

రఘు మంచంమీద కూర్చుని కాళ్ళు క్రిందికిజార్చి ఉంచడముచూచి సుందరి అదే సమయమనుకొని చటుక్కున వంగి భర్తపాదాలు ముట్టుకొని అద్దుకొన్నది.

రఘుకు ఒళ్ళు అంతా గగుర్పాటు కలిగింది. చిన్న చిన్న పూలు ఉన్నటువంటి లత అయిపోయింది అతని దేహం. అతడు కళ్ళుమూసుకొని ఒంటిపై పులకలు కలగడమువలన కలిగే ఆనందాన్ని అనుభవించినాడు.

ఆ తరువాత సుందరి బుగ్గపై ఒకచిటిక వేసి రెండుబుజాలపైన తనచేతులుంచి ధైర్యంచేసి ఒక్కసారి గాఢంగా కౌగిలించుకొన్నాడు. సుందరికి ఆనందంతో కళ్ళనిండా నీళ్లు వచ్చినవి.

ఆ తరువాత రఘుకూడా కొత్తబట్టలు కట్టుకొని, భార్యను వెంటబెట్టుకొని తల్లి దగ్గరకు వెళ్లాడు. శేషును ఎత్తుకొనే వచ్చింది సుందరి.

కాంతం చాపపై కూర్చుని ఏదో ఆలోచిస్తున్నది. అప్పుడు రఘూ, సుందరీకూడా ఒకేసారివంగి పాదాభివందనం చేశారు.

అందరూ ఆమె పాదములకు నమస్కరించడముచూచి శేషుకూడా బా అమ్మ పాదాలు ముట్టుకొని కళ్లకు అద్దుకొన్నది.

కాంతం ఆనందానికి అంతులేదు ఆమెహృదయం గట్లు తెగి పారుతున్న మందాకిని అయింది. పొంగిపొరలుతున్న అమృతభాండం అయింది.

కాంతం కోడలు చెక్కిళ్లుదువ్వి, వేళ్లు వంచి తన చెంపకి తాకించుకొన్నది, “కొడుకుకోడల నిమిరింది. శేషును ఎత్తుకొని హృదయానికి అదుముకొన్నది.

కాంతం నిమీలిత నేత్రయై “ప్రభూ ముసలితనంలో కూడా నాకు ఇంత ఆనందం లభిస్తుందని నేను అనుకోలేదు. జీవితమార్గంలో అడుగడుగున అమృతకలశాలు అమర్చావా తండ్రీ.” అని మనస్సులో అనుకొన్నది.

ఇట్లాగే రోజులు గడిచినవి. ఒకరోజురాత్రి ఎనిమిది గంటలకు సుందరి ప్రసవించింది.

రఘు ఇంటికి రావడముతోనే తల్లివచ్చి "నీకు కూతురు పుట్టిందిరా నాయినా అంతా నీపోలికే" అన్నది.

కోడలు కొడుకుని కనలేదని ముసలాయన మాత్రం కాసేపు గునిసినాడు. రఘు ఈసంగతివిని నవ్వి ఊరుకొన్నాడు.

కాంతానికి ఇప్పుడు ఈ ఇద్దరు మనుమరాళ్ళతోను సరిపోతున్నది. ఈ రెండో మనుమరాలు ముద్దులన్నీ చూడాలె. పెద్దకూతురు సుశీ మళ్ళీ నీళ్ళు పోసుకొన్నదని వియ్యంకుడు ఉత్తరం వ్రాశాడు. దాన్ని అనుకొచ్చి చెంబెడు నీళ్లూ పోయాలె. వీట్లోతప్పేది ఏమీలేదు. ఆమెకు ఈ పనులన్నీ ఏమీ భారంగానూ లేవు. కోడళ్ళకు కూతుళ్ళకు ముద్దుముచ్చటలూ తీర్చుకోడమే ఆమెకు ఆనందం. ఆమె జీవితము హాయిగానే వెళ్ళిపోతున్నది.

కాంతం ప్రతిరోజూ, ముసలాయనతో అంటూ ఉంటుంది, "చూడండి, రాధకూ ఒకు మీదు వచ్చిన సంబంధాలలో ఏదో ఒకటిచూచి పెళ్ళి చేసివేయాలె. ఆలస్యంచేస్తే కాదు" అని!

"ఇప్పుడేం తొందరలే!" అంటాడు ఆయన.

"మీకేం, మీకేమీ తొందరలేదు. వాడికి పెళ్ళి కావాలె! పెళ్ళాము కాపురానికి రావాలె! దానికడుపు ఫలించి మనుమడు పుట్టాలె! వాణ్ణిచూచి, ఈ లోపున పెద్దకోడలు ఎట్లాగూ మనుమణ్ణి కంటుంది, వాణ్ణిచూచి, నేను కాశీకి వెళ్ళిపోవద్దుటండీ" అంటుంది కాంతం. ముసలాయన నవ్వి ఊరుకొంటాడు.